## సిపిఐ(ఎం) పార్టీ 21వ జాతీయ మహాసభల ఆహ్వాన సంఘం నిర్వహించిన నవల, కథ, కవితల పోటీ విజేతలకు ఏప్రిల్ 18న విశాఖపట్నంలో విశాఖ బుక్ ఫెస్టివల్‌లో గురజాడ సాహిత్య వేదికపై జరిగిన బహుమతి ప్రదాన దృశ్యాలు



ప్రసిద్ధ ఆర్థిక శాస్త్రవేత్త ప్రభాత్ పట్నాయక్ చేతుల మీదుగా నవలల పోటీలో ప్రథమ బహుమతి అందుకుంటున్న శిరంసెట్టి కాంతారావు, ద్వితీయ బహుమతి అందుకుంటున్న సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి, తృతీయ బహుమతి అందుకుంటున్న గనారా.



కథల పోటీలో ప్రథమ బహుమతి అందుకుంటున్న సింహప్రసాద్, తృతీయ బహుమతి అందుకుంటున్న ఎమ్వీ రామిరెడ్డి.



కవితల పోటీలో ప్రథమ బహుమతి అందుకుంటున్న కె. ఆశాజ్యోతి, ద్వితీయ బహుమతి అందుకుంటున్న కటుకోర్ఘ్వల రమేష్ తృతీయ బహుమతి అందుకుంటున్న ర్యాలి ప్రసాద్

PRSVMORA159

సాహిత్య ప్రస్థానం
మే 2015
సంపుటి : 14 సంచిక : 5

# భూమికోసం

భూమికోసం భుక్తి కోసం సాగే రైతుల పోరాటం... అనంత జీవిత సంగ్రామం అని శ్రీశ్రీ ఎప్పుడో రాశాడు. దశాబ్దాల తర్వాత ఆ భూపోరాట ప్రతిధ్వనులు మరింత తీవ్రంగా వినిపిస్తున్నాయి. భూమి ఇవ్వాలని కాదు- మా భూములు లాక్కోవద్దని రైతాంగం ఘోషించే పరిస్థితులు ఏర్పడుతున్నాయి. కేంద్ర ప్రభుత్వం తీసుకొచ్చిన భూసేకరణ సవరణ బిల్లుపై వ్యతిరేకత పెల్లుబుకుతున్నది. ప్రతిపక్షాలూ రైతు సంఘాలూ ఒక్కతాటిపై నిలబడి వ్యతిరేకిస్తుంటే తాత్కాలికంగా వెనక్కు తగ్గారు. కాని అసలు ఆలోచన మానుకున్నది లేదు. ఇక ఆంధ్ర ప్రదేశ్‌లో రాజధాని నిర్మాణానికి భూసమీకరణ మొదటి నుంచి వివాదాస్పద వ్యవహారంగా వుంది. ఇటీవలనే ఉన్నత న్యాయస్థానం కూడా ఇష్టంలేని రైతుల నుంచి భూములు తీసుకోవద్దని ఆదేశించింది. ఈలోగా విజయనగరం జిల్లా భోగాపురం దగ్గర విమానాశ్రయం కోసం 15 వేల ఎకరాలు సమీకరించాలని రాష్ట్ర ప్రభుత్వం లక్ష్యం ప్రకటించింది. తెలంగాణలోనైతే దళితులకు కుటుంబానికి మూడెకరాల చొప్పున భూమి ఇస్తానని ప్రకటించిన ప్రభుత్వం అందుకు భూమి లభించడం లేదని చెబుతున్నది. కాని రెండు ప్రభుత్వాలూ పారిశ్రామికవేత్తలకు మాత్రం లక్షల ఎకరాల్లో భూములు ఇస్తామని రాయితీలు కురిపిస్తున్నాయి. దేశంలోనూ రాష్ట్రాలలోనూ కూడా భూమి సమస్యే కీలకంగా రావడం వూహించదగిన విషయమే. వేలమంది రైతాంగం ఆత్మహత్యలకు దారి తీస్తున్న వ్యవసాయ సంక్షోభాన్ని పరిష్కరించకపోగా పంట భూములను లాక్కుని రియల్ ఎస్టేట్ ప్రయోజనాలకు ఇతర వ్యాపార పారిశ్రామికావసరాలకు కట్టబెట్టాలని ప్రభుత్వాలు పాకులాడుతున్నాయి. ఇది దేశానికి ఎంతమాత్రంక్షేమ దాయకం కాదు. దేశంలో అత్యధికులకు పని కల్పించడమే గాక పట్టెడు మెతుకులు దొరకడానికి కారణమైన వ్యవసాయమే కూలిపోతే దానిపై ఆధారపడిన కోట్లమంది బజారున పడతారు. పరిస్థితులు తారుమారవుతాయి. కనక పాలకులు భూములు లాక్కోవడమనే ఆలోచనలు విరమించి భూములను పండించే వారికి వాటిపై పనిచేసే వారికి అండగా వుండటానికి చర్యలు తీసుకోవాలి. లేదంటే ఉద్యమాలు ఉద్రిక్తతలు తప్పవనేది కళ్లముందు కనిపిస్తున్న వాస్తవం.

బొమ్మలు : తుంబలి శివాజీ, జె.వెంకటేష్, భాస్కర్

## ఈ సంచికలో ...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్‌భవన్, ఫ్లాట్ నెం. 21/1, అజామాబాద్
ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర,
హైదరాబాద్ - 500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040ꞏ27635136,
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

# పొట్టు పొయ్యి

- కె. ఆశాజ్యోతి
09449672394

(సిపిఐ(ఎం) 21వ జాతీయ మహాసభల సందర్భంగా నిర్వహించిన పోటీలో ప్రథమ బహుమతి పొందిన కవిత)



పొట్టు పొయ్యి కూరడం
ఎంత అద్భుతమైన కళ

పొట్టును పొయ్యిలోకి పొందిగ్గా కూరడం
ఎంత నేర్పరి లక్షణం
నా బాల్యంలో తెల్లారగట్లే పొట్టు కూరుతుంటే
ఆ పొట్టు వాసన వగరుగా తగిలి
నాసికను రసనాగ్రం చేసేది
అప్పుడే తెలిసింది రసనకే కాదు
నాసికకు కూడా రుచి తెలుసని
నేలపై కూచుని రెండు అరిపాదాల మధ్య
అడుగు ఎత్తున్న ఇనుప పొయ్యిని ఇరికించి
రంపపు పొట్టు పోస్తూ చలాగ్గా కూరడం
బాల్యంలో మామూలే అనిపించినా
అసామాన్యమని ఇప్పుడు తోస్తోంది

పొట్టు కూరాక కట్టెలు మండించడానికి
పొయ్యి ముందు భాగంలో ఒక రంధ్రం
దాన్ని కాగితంతో కప్పెట్టి పొయ్యి మధ్యలో రోకలి పెట్టి
అది కదలకుండా పట్టి
పాదాలు కదపక - రోకలి మెదపక
పొట్టు పోస్తూ కొయ్యతో పొట్టు కూరుతూ
గట్టి పడే కొద్దీ తిరిగి పొట్టు పోస్తూ పోవడం
ఎంత సవ్యసాచిత్వం?
అర్జునుడైనా ఆ నేర్పు ముందు బలాదూరే!

పొట్టు కూరాక రోకలిని మెల్లగా తిప్పుతూ
పుట్టలోంచి పామును తీసినట్టు ఒడుపుగా
తీయకపోతే - ఒక్కసారిగా కోట గోడ కూలినట్టుగా
పొట్టంతా కూలిపోతుంది
ఊడలా పాతుకుంటుందని కూరాక
నిలువునా కూలిపోతే
కలిగే దుఃఖం చెప్పనలవి కాదు!
ఎందుకంటే
వంట ఆలస్యమవుతుందని
అమ్మ రెండు తగిలిస్తుందనే భయం
వెన్నులో పామై జరజరా పాకేది !

అందుకే
దొమ్మరి పిల్ల తీగపై గుత్తంగా సాగినట్టు
పళ్ళ మధ్య నాలుక పంటి కింద బడక తప్పించుకున్నట్టు
నెమ్మదిగా ఒడుపుగా రోకలి లాగాలి !
ఎట్టకేలకు కృషి విజయవంతమైందనుకుంటే
సరి కాదు !

కట్టెలు పెట్టి మంట రాజేయడానికి
సైంధవుడిలా అడ్డుగా ఉన్న కాగితం
కుదురుగా తొలగించి పొట్టును
సుతారంగా సున్నితంగా మునివేళ్ళతో
పిచ్చుక గూడును కదిలించినట్టు
గువ్వ రెక్క కింద పిల్లను తాకినట్టు
పొట్టును రాల్చుతూ పోకపోతే
రాక్షసుడి ప్రాణం
ఏడు సముద్రాలకవతల చిలకలో ఉన్నట్టు
తెలుసుకొని మసలుకోకపోతే
పడిన శ్రమంతా వ్యర్థం !
మళ్ళీ మొదటికి పయనం !

ఇంత క్లిష్టమైనా ఆ పనిని
లేత చేతులు మెషిన్ గన్ పేల్చినట్టు
చక చకా చేసేవి!
అలవోకగా చేసేసి - నడుం మీద చేతులేసి
ఆరిందాలా గర్వంగా నేనే గనుక చేసాను కదా
అన్నట్టు చూసేవి!

పొయ్యి తీసుకెళ్లి వంటింట్లో పెట్టి వెలిగిస్తే
మంటలు మిట్ట మధ్యాహ్నం వేసవిలో
ప్రచండ భానుడి చంద్ర నిప్పుల్లా
భగ భగమంటూ అరుణ కాంతులను వెలార్చుతుంటే
చూడముచ్చటగా ఉండేది ఆ పసి మనుసుకి !!

వంట ముగిసాక కూలడానికి సిద్ధంగా ఉన్న బూడిద
నల్లగా తెల్లగా - బరక బరకగా
గత చరిత్రకు నమూనాగా నిలబడేది!
వేలు తాకించగానే పెళుసులై పడిపోయేది!

పల్లెలన్నీ ప్రపంచీకరణాలై
బయో గ్యాసులై - కరెంటు స్టవ్వులై
టాటూలు వేయించుకుంటుంటే
పచ్చని చెట్టూ - వెచ్చని పొయ్యీ
కనుమరుగైపోయాయి - జ్ఞాపకాలై మిగిలాయి

- కన్నడం : డా॥ మురళీధర కిరణకెరె
అనుసృజనం : వి. కృష్ణమూర్తి (అనన్య)
94924 50984

# దయా మరణం



"డాక్టర్ నొప్పికి, శక్తికి ఇంజషన్ యిచ్చేయండి. ఏం పాపం చేసిందో 'తుంగ' యింకొన్నాళ్ళైనా బతికిబట్టకట్టనీ, మా యింట్లోనే పుట్టిందేది నా మొగుడికి తల సరిలే. ఇదెందుకు వూరికే బాధపడుతూండాలి.

గాయం చెడ్డవాసన కొడతా వుంది అని మూన్నాల్లనుంచి, డాక్టరుకు చెప్పి చంపేపిస్తాం అని గొణుగుతున్నాడు. పుట్టించేది, ప్రాణం తీసుకుపోయేది అంతా ఆ దేవుడి చేతిలో వుండేది. ఆయుస్సు ముగిసి అదే చావనీ అని చెబితే నా మొగుడు యింటా వుండ్లా సామీ. మీరైనా కొంచెం బుద్ధి చెప్పండి!" సీనప్ప భార్య గౌరమ్మ అన్న మాటలు విని నా గుండె జోరుగా కొట్టుకోవడం ప్రారంభించింది. నేనిపుడు యిక్కడకు వచ్చిన కారణమే వారి ఆవు తుంగకు దయామరణం యివ్వాలని! యీ విషయం తెలిస్తే యీ మహా తల్లి వూరికే విడుస్తుందా? నన్ను పేలాలు ఏంచినట్లు వేయించదా? గాబరా చెందుతూ సీనప్ప ముఖం చూశా.

'సార్, మీరు చేసేది చేయండి మిగిలినదంతా దేవుడెట్లా చేస్తే అట్లా అవుతుంది. అని మెల్లగా కన్నులు మిటకరించాడు. నిజం చెప్పాలంటె వారి ఆవుకు ఏం చేయాలో నిన్నటిరోజే మా మధ్య ఒప్పందం కుదిరిపోయింది.

'సార్, వీపు వెన్నెముక విరిగిపోయుంటె మీరు మాత్రం ఏ చేసేకవుతుంది? మేము మా కర్తవ్యం చేశాం. మీరు చేసేదంతా చేశారు. ఇంకొక ఉపకారం చేయండి. తుంగకు దయామరణం యిచ్చేయండి...

సీనప్ప కోరిక విని నాకు ఆశ్చర్యం కానీ, గాబరా కానీ కలుగ లేదు. బయట మేయడానికని విడిచిపెట్టిన వారి ఆవు 'తుంగ' ఏటిప్రవాహంలో పడిపోయి వెన్నెముక విరిగించుకొన్నది. ఇపుడు దీనికి చికిత్స చేసినా అది పూర్తిగా కోలుకోవడం సాధ్యం కాని పని. పరిస్థితిని యింటివారికి వివరించా. ఇది జరిగి అపుడే వారం రోజులైంది. ఒక వారం నుండి అలానే పడుకొని వుండటంతో శరీరంలోని గాయాల నుండి చెడ్డ వాసన రావడం ప్రారంభమైంది. అలా అని తినేది, త్రాగేది ఏమీ తగ్గించలేదు. పడుకొన్న, చోటే కసువు బాగాతినేది. అలాగే కుడితి త్రాగేది.

'అలాగే కానీ సీనప్పా. రేపు మీ తుంగకు ముక్తి యిచ్చేస్తాం. శరీరమంతా పుండై బాధపడేకంటే దాని ప్రాణం తీయడమే మంచిది. మీకూ పుణ్యం వస్తుంది'. అలా సలహా యిచ్చి పాప ప్రజ్ఞతో ఓడిపోయినట్టున్న సీనప్పకు ధైర్యం యిచ్చా. అయితే విషయం నేననుకొన్నంత తేలికగా వున్నట్టు లేదు.

'కానీ సార్, ఒక ప్రాబ్లమ్. తుంగ ప్రాణం తీయడానికి నా భార్య బిల్‌కుల్ ఒప్పడం లేదు. ఇది గోహత్య అని అంటుంది. ఆయుస్సు ముగిస్తే చావనీ, బలవంతంగా చంపే పాపం పని వద్దే వద్దు అని గలాటా చేస్తావుంది డాక్టర్. చిలక్కు చెప్పినట్టు చెప్పి చూశా. అదిమాత్రం ఒప్పడం లేదు. అందుకే దానికి తెలీకుండా తుంగ ప్రాణం తీసేయండి సార్... సీనప్ప మెల్లగా ఒక బాంబు వేశాడు.

'లేదు, లేదు... అదంతా అయ్యేపని కాదు. సీనప్పా మీ యింటిలో అందరూ ఒప్పితే మాత్రమే మెర్సీ కిల్లింగ్ చేసేకి అయ్యేది. రూల్సు ప్రకారం మీరు దయా మరణానికి అంగీకార పత్రం రాసి యివ్వాలి. దొంగతనంగా ప్రాణం తీస్తే అది హత్య అవుతుంది. అని చెప్పి సీనప్ప కోరికను త్రోసిపుచ్చా.

'సార్' మీ కాళ్ళు పట్టుకొంటా. తుంగ పడుతున్న అవస్థ చూస్తే కన్నీళ్ళు వస్తాయి. మొదటే అది గట్టి ప్రాణం. యిప్పట్లో తనకు తానే అది చావదు. నెలలకొద్దీ యిలా బాధపడుతూండడం మాకు చూడడానికి కష్టమవుతున్నది. ఏమైనా చేసి దానికి ముక్తి యివ్వండి సార్; అని సీనప్ప వేడుకోసాగాడు. అతని పోరు తట్టుకోలేక వేరే ఎవరికీ తెలియకుండా వారి తుంగకు గౌరవంగా దయామరణం యివ్వడానికి అంగీకరించా. మరుసటిరోజు తెల్లవారి నా అటెండర్ వెంటరాగా వారి యింటిలో హాజరయ్యా.

ప్రాణం తీయడానికి కావాల్సిన రసాయనిక ద్రవం కలిపిన డ్రిప్‌బాటిల్ అపుడే తయారుగా వుంచుకొన్నాం. ఆవు గొంతుకున్న రక్తనాళానికి డ్రిప్‌సెట్ కనెక్ట్ చేసి బాటిల్‌లోని ద్రవాన్ని, వేగంగా ఆవు రక్తంలోనికి చేర్చుతూ పోతే చాలు. బాటిల్ ముగిసే లోపలే గుండెపోటు వచ్చి ఆవు చనిపోతుంది. నెప్పి చెందడం, బాధపడడం, సంకటపడడం లాంటి ప్రశ్నలే వుండవు. చికిత్సకు లొంగని రోగాలలో వెన్నెముక, తొడెముక విరిగిపోతే పశువుల యజమానులు కోరితే దయామరణం యివ్వడానికి అవకాశముంది. ఇలాంటి మెర్సీకిల్లింగ్ జంతువుల విషయంలో చట్టసమ్మతమే.



నేను కోరిన ప్రకారం వేడినీళ్ళు తెచ్చియిచ్చిన గౌరమ్మ తుంగ ప్రక్కలోనే కూర్చొనేసింది. చాలదన్నట్టు, ఆమెకు తోడుగా ప్రక్కయింటి ముసలిది కంటిమీద రెప్ప వేయకుండా చూస్తూ మమ్ములనే గమనిస్తున్నది. చూడమ్మా మీరు అనవసరంగా బాధపడుతూ తల చెడుచుకోకండి. మీ తుంగకు బ్రతికినన్ని రోజులూ చికిత్స చేద్దాం. ఇప్పటికపుడే దానికి చాలా నిస్సత్తువ వచ్చేసినది. ఈ డ్రిప్ కూడా తట్టుకోవడానికి దాని వల్ల అవుతుందో లేదో? వారిద్దరి మనసులో ఆవు విషమ పరిస్థితి గురించి అనుమానం కలిగిస్తూ నిరీక్షిస్తూ కూర్చొన్నా! నిజం చెప్పాలంటే, ఆవు యింకా గట్టిగా వుండడంతో, యింకా కొన్ని నెలలైనా బ్రతికే సూచనలు వున్నాయి.

'డాక్టర్, డ్రిప్ వద్దు. ఒట్టి ఇంజక్షన్ మాత్రం యివ్వండి చాలు! మేము ముందుగా అనుకొన్న ప్రకారం జరగడానికి తొందరయ్యే సూచనలు కనపడ్డాయి గౌరమ్మ అలా అనడంతో.

తుంగ శరీరమంతా యిలా గాయాలు అయినవి. గాయాలు మాని ఎండాలంటె స్ట్రాంగ్‌గా వుండే ఇంజక్షన్ యివ్వాలి. ఈ ఇంజక్షన్ బాధ తగ్గాలంటే డ్రిప్స్ ఏసి తీరాలి అని అప్పటికి నాకు తోచిన సంజాయిషీ యిచ్చి ఆవు గొంతుకున్న రక్తనాళానికి డ్రిప్ సెట్ కనెక్ట్ చేశా. బాటిల్లో వున్న ద్రవం వేగంగా తుంగ రక్తంలోనికి చేరసాగింది. గౌరమ్మ, ముసలిది మమ్ములనే చూస్తూండడాన్ని గమనించిన నా అటెండర్‌కు భయంతో చెమట పట్టసాగింది. డ్రిప్ బాటిలు పట్టుకొని వున్న అతని చేయి జోరుగా అదరడం ప్రారంభించింది. పాపం, యిలాటిది వానికి మొదటి అనుభవం! 'ఇదేమిటి, కాంపౌండర్ చేయి యిలా అదురుతా వుంది.' సెక్యూరిటీ గార్డులాగా మేము చేస్తున్నదంతా గమనిస్తున్న ముసలిది అడగనే అడిగింది. 'అవ్వా, వానికి ఆరోగ్యం సరిగా లేదు. నిన్నటిదినం బాగా జ్వరం వచ్చింది. ఇంకా పూర్తిగా కోలుకోలేదు. అందుకే యిలా అదురుతున్నాడు. నేను వెంటనే యిచ్చిన వివరణతో, 'అయ్యో పాపం' అని అన్నది. తన భార్య యిక్కడే వుంటే జరిగే అపాయం తెలిసిన సీనప్ప, కాలు కాలిన పిల్లిలాగా ఇంట్లోనుండి పెరట్లోకి తిరుగుతూ, 'ఏమేవ్ ,డాక్టరు చేయి కడుక్కోవడానికి వేడినీళ్ళు సోపు రడీ చేయి.. అలాగే వారు కాఫీ త్రాగరు. మంచి టీ చేయి. చలి జోరుగా వున్నది' అని అంటూ భార్యను లోపలికి పంపడానికి ఎక్కడలేని ప్రయత్నం చేయగా, గౌరమ్మ మాత్రం కూర్చొన్న చోటు నుండి లేవలేదు.

'అయ్యో, వేడినీళ్ళు మరుగుతున్నాయి. డాక్టరు చేతులు కడుగుకోవడానికి అక్కడికే పోతారు. మరి టీ చేయడం ఎంతసేపు. వారు కాళ్ళూ, చేతులూ కడుగుకొని వచ్చేలోగా టీ రెడీగా వుంటుంది. మీరు వూరికే వుండండి' అని భర్తను గదురుతూ తుంగ నుదురు నిమిరసాగింది. 'ఎలాంటి కష్టం తెచ్చుకొన్నావు. కొంచం జాగ్రత్తగా నడువకూడదా' అని తుంగతో మాట్లాడడానికి ప్రారంభించిన తన భార్యను అక్కడినుండి లేపి పంపే ప్రయత్నం కొనసాగించాడు సీనప్ప.

'నువ్వు యీవైపుకు వచ్చేసేయి మహారాణీ. అక్కడ అడ్డం కూర్చొన్నావు"

"అయ్యో మీరెందుకు శరీరంపై ఏదో వచ్చినట్టు ఆడ్తారు' నేనిలా నిమిరితే తుంగకు ఇంజక్షన్ నెప్పి కొంతైనా తగ్గుతుంది. ఏదో కొంచం సమాధానం చేస్తామని యిక్కడ కూర్చొంటే మీ పోరు జాస్తి అయ్యిందే' అని భార్య అనడంతో సీనప్ప యింకా తబ్బిబ్బయ్యాడు. భయంతో అతడి ముఖం నల్లబడింది. 'అది గ్లూకోస్ కదా డాక్టర్? మరెందుకు దాని రంగు అంత తెల్లగా వుంది? ముసిల్ది మరొక బాణం విడిచింది. వయసు

దెబ్బయిదాటినా ముసలిదాని కన్నులు ఎంత చురుగ్గా పనిచేస్తున్నాయి? కంటికి ఏమైనా వచ్చివుంటే బాగుండేది!

'అవ్వా, యిది గ్లూకోసే. ఎక్కువ శక్తి రావాలని కొంచం ఎలక్ట్రాల్ లాంటి పౌడర్ అందులో చేర్చా. అందుకే తెల్లరంగు వచ్చింది. నేను యిచ్చిన వివరణ వింటూనే అవ్వ పళ్ళులేని నోటితో బోసిగా నవ్వినది. కాని, మేము మాత్రం అలా నవ్వే స్థితిలో లేము. ఇక కొన్ని నిముషాలలోనే ఆవు చావుకు దగ్గరౌతుంది. అపుడు అది బిగ్గరగా అరవడం, కాళ్ళు జోరుగా అల్లాడించడం లాంటివి చేస్తుంది. అలాంటి స్థితిలో ఈ గౌరమ్మ, ముసలిది యిక్కడే వుంటే అపాయం ఖచ్చితమనిపించింది.

'డాక్టర్, తుంగ జోరుగా అదురుతావుంది. డ్రిప్ నిదానంగా విడువండి. మనుషులకు యింత జోరుగా విడిస్తే 'గుటక్' అంటారు గదా!



డ్రిప్ నిదానంగా విడిస్తే ఆవు గుండె కొట్టుకోవడం నిలువదు. డ్రిప్‌లోని ద్రవం రక్తంలోనికి యింకా వేగంగానే పోవాలి. అందుకే అది అదురుతుండేది. వీరి అసమాధానం ఎక్కువవుతుండడంతో సీనప్ప వైపు చూచా. అతనికీ ఏమిచేయాలో తెలియక అదురు పుట్టుకొస్తున్నది! భార్యకు విషయం తెలిస్తే ఆవుకు తోడుగా తన తద్దినమూ ఖచ్చితమనిపించిందెమో!

'ఏమేవ్, ముందరి వైపు ఎవరో పిలుస్తున్నట్టుంది. పోయి చూసిరా...' మరలా భార్యను బయటకు పంపడానికి ప్రయత్నించాడు.

'తెలతెలవారి నన్ను అడుక్కొని ఎవరొస్తారు? మీరు కావాల్సింటే పోండి. నేను మాత్రం తుంగను విడిచి రాను' అంటూండగా, నా గుండె జోరుగా కొట్టుకొనేలాగా చేసినది గౌరమ్మ!

'డాక్టర్, డ్రిప్ చాలు నిలుపండి. తుంగ శరీరం అదరడం ఎక్కువ జాస్తి అయినది. నిలుపకుంటె తుంగ చచ్చిపోతుంది' అని గౌరమ్మ అరవడంతో మా గుండె అదిరేలాగ చేసినది.

'అలాగేనమ్మా... యింక నిలుపుతా...' అని వెంటనే చెప్పి డ్రిప్ సెట్ స్క్రూను ఆఫ్ చేస్తున్నట్టు నటిస్తూ ద్రవం క్రిందకు దిగే కిటికీ భాగాన్ని నా చేతితో మూశా. నేను ఆమె కోరినట్టు డ్రిప్ నిలిపేస్తే యింతసేపూ చేసినదంతా వ్యర్థమై ఆవు మొదటి స్థితికే వచ్చేస్తుంది. ఔను. ఇక రెండు మూడు నిమిషాల్లో ఆవు చనిపోతుంది. ఆ సమయంలో వీరిక్కడ వుంటే గండాంతరమే.

'తుంగ గుండె ఎందుకో చాలా నిదానంగా కొట్టుకొంటూ వుంది. వేరే యింజక్షను యివ్వాలి. అర్జంటుగా వేడినీళ్ళు కాచి తీసుకురమ్మని గౌరమ్మను లోపలికి పంపా. గూటానికి కట్టిన ఎనుము లాగా వున్న చోటనే నిలబడి అంతటినీ గమనిస్తూ.. రికార్డు చేస్తున్నట్టున్న ముసలిదాన్ని యిక్కడినుంచి ఎలా తరమాలని ఆలోచిస్తూ... 'అవ్వా, తుంగ పరిస్థితి సీరియస్‌గా వుంది. దీని కథ ఏమౌతుందో భగవంతుడికే తెలుసు. ధర్మస్థలం ప్రసాదం వుంటె తెచ్చి దాని ముఖానికి పూయండి. ఇప్పట్లో దీనిని దేవుడే కాపాడాలి' నా తంత్రం పని చేసింది.

'నీది మంచి భక్తే డాక్టర్. ధర్మ స్థలానిది లేదు. మొన్న నా కూతురు హుర్నాడు అన్నపూర్ణేశ్వరి దేవస్థానం నుంచి తెచ్చిన ప్రసాదముంది. వుండు తెస్తా' అని అంటూ అవ్వ వేగంగా లోనికి నడిచినది. అపుడు చూడగా ఆవు ఒకటి రెండు మార్లు కాళ్ళు నిగిరిస్తూ శరీరాన్ని పైకీ కిందకూ లేపుతూ చివరి వూపిరి విడిచింది. వెంటనే డ్రిప్ సెట్ తీసేసి అటెండర్‌కు ఆవు గుండెను ఒత్తమని చెప్పా. గౌరమ్మ వేడినీళ్ళతో వస్తూండడం చూచి, నా మాటలు బిగ్గరగా వచ్చినవి. 'ఛ ప్రాణమే పోయింది.! గుండె చాలా వీక్‌గా వుండిందనుకొంటా. ఆ రోజు పడినపుడు గుండెకూ ఏటు పడినట్టుంది లేకుంటే యింత వేగిరం పోయే ప్రాణం కాదు. ఏం చేస్తాం. అందరూ వారి వారి కర్తవ్యం చేసినట్టు అయింది..' అని అన్నా.

ఒకటి రెండు క్షణాలు గౌరమ్మ నోటి నుండి మాటలే రాలేదు. తుంగ కాళ్ళ వద్ద కుక్కిరి కాలులో కూర్చొని తుంగకు శ్రద్ధాంజలి చెల్లించినది! 'పాపం దానికి ఆయుస్సు వున్నది యింతేననుకొంటా. శరీరంతో పుండ్లతో బాధపడి, బాధపడి చచ్చేకంటె తొందరగా ప్రాణం పోయినదే మంచిదైంది. అదీకాక మరునాడు యింటిలో పారాయణం ఏర్పాటు చేశాము. ఇంటిలోపలంతా దీని చెడ్డవాసన వచ్చి ఒకరకంగా అసహనం కలిగేది. పుణ్యాత్మురాలు ఎక్కువ తొందర యివ్వకుండా వెళ్ళిపోయింది. గౌరమ్మ అలా అన్న, వెంటనే మా టెన్షన్ తగ్గుముఖం పట్టి మనసు తేలిక పడినది. మా మీద అనుమానం రాలేదు తనకు. చివరగా, ఈ రహస్యంతో కూడిన కార్యం విజయవంతంగా ముగించి వెనుదిరిగే దానికి ముందు, యిలాంటి కేసులను యికముందు అంగీకరించకూడదని ఒక గట్టి సంకల్పం చేశా. ☙

# నాకో మనిషి కావాలి

- కటుకోర్ద్వుల రమేష్
9949083327

(సిపిఐ(ఎం) 21వ జాతీయ మహాసభల సందర్భంగా నిర్వహించిన పోటీలో ద్వితీయ బహుమతి పొందిన కవిత)



ఏది కలో.. ఏది నిజమో
ఏది జీవమో... ఏది నిర్జీవమో
ఈ మార్కెట్‌లో
మనిషే ఒక వస్తువయ్యాక
మనిషిని గుర్తించలేకున్నాను
మహా మేధావు లెవరైనా
నాకో మనిషిని వెతికి పెట్టండి
డాలర్ వ్యామోహంలో
విహంగాలై ఎగిరి పోయిన
నా సంతానం సాక్షిగా
నన్ను నేను కోల్పోయి
చాలా కాలమయ్యింది
ఇప్పుడు
నన్ను నేను వెతుక్కోవటానికి
నాకో మనిషి కావాలి...!

చెమట చుక్కలమీద
పెట్టుబడులను నాటిన పెత్తనమేదో
నా పల్లె జన ప్రాణ పల్లవైన
వృత్తుల్ని... ప్రవృత్తుల్నీ
నిర్ధాక్షిణ్యంగా కబలిస్తోంది
ఆకలిచావుల ఆర్తనాదాల్ని
క్రూరంగా ఆస్వాదిస్తోంది
ప్రపంచ పోలీసు ముసుగులో
నా పచ్చదనమంతా లూటీ అవుతోంది
ఫ్యాక్టరీల ఉక్కుపాదం క్రింద
నా సస్య వ్యవసాయ క్షేత్రం మాడిమసైంది
వస్తువులు వస్తువులుగా మొలకెత్తుతున్న
బహుళ జాతి సంస్థలు
నన్నూ ఓ సరుకును చేస్తున్నాయి
ఇప్పుడు
నన్ను మనిషిగా గుర్తించటానికి
నాకు మరో మనిషి కావాలి..!

మానవుడా..
నీ మూలాలను నరుకుతున్నాడెవడో
కళ్లకు కనిపించకుండా
వేళ్లకు తాకకుండా
మెదళ్లకు చిక్కకుండా
ఏ స్పర్శా లేకుండా
ఓ మాయా వస్త్రాన్ని
మనందరిపై కప్పుతున్నాడు
మనిషిని మనిషినుండి దూరంచేసే
మంత్రదండాన్ని తిప్పుతున్నాడు
వాడి కుతంత్రాలను
కూకటి వేళ్లతో పెకిలించే
నిండైన నిఖార్సయిన
నాకో మనిషి కావాలి...!

ఆకలి అవసరాలపై
అప్పుల దండల్ని కూర్చి
జీవతాన్ని భిక్షపాత్రగా మార్చి
నా జాతి జనాన్ని
ప్రపంచ బ్యాంకు బొక్కేస్తోంది
శకలాలు శకలాలుగా
మనుషులంతా రాలిపోయారు
చివరంటూ ఇంకెవ్వరైనా మిగిలుంటే
దుర్భిణీతో వెతకండి
కాళ్లు చేతులు తలకాయే కాదు
ఆలోచించే మెదడున్న
నాకో మనిషి కావాలి...!

వాడి రక్తదాహ నాలుకపై వాణిజ్యం
బ్రతుకులన్నీ అక్కడే బంధీ
శ్రమంతా ఇక్కడ సరుకుల ముఖాలపై
నగిషీలు... నగిషీలుగా..
చీము నెత్తురూ లేని
పరాన్న బుక్కులు నాకొద్దు
స్వేదం... క్రోధం.. మోదం వున్న
నాకో మనిషి కావాలి...!

నా పచ్చని ప్రకృతిపై సెర్చిలైట్లు
నా వెచ్చని బ్రతుకుపై శాటిలైట్లు
ఆకాశంలో అణువణువూ పహారా
జీవితమంతా త్రిశంకు స్వర్గంలో
ఈ భూమ్మీద నిటారుగా నిలబడే
నాకో మనిషి కావాలి...!

ఉడికే నెత్తుర్ని మూటగట్టి
బ్రతుకు జీవుడా అనే 'లాంగ్‌లీవ్' నాకొద్దు
భగభగ మండే భావాలతో
దిగంతాల అంచుల్నితాకే ఓ ప్రగతిశీల
సామూహిక 'లాంగ్‌మార్చ్' కావాలి....!
పోరాట జ్వాలల్ని రగిలించే
నాకో యోధుడు కావాలి...!
సమస్యల పద్మవూహాల్ని ఛేదించే
ఓ ఉద్యమ ధీరుడు కావాలి
విజ్ఞాన వెలుగుపూలు వెదజల్లే
నాకో మనిషి కావాలి..!

బంధాలు అనుబంధాలు మృగ్యమవుతున్న
ఈ దుర్భర దృశ్యాల నుండి
బ్రతికి బట్టకట్టి
మనిషన్నవాడెవడైనా నడిచొస్తే..
యుద్ధానికి సిద్ధమవుతున్న ఈ గుండెను
శాంతి కపోతంగా ఎగరేస్తాను
రక్తంతో తడిచిన నాదేహాన్ని
ఎర్రని తివాచీగా పరుస్తాను..
అవును నాకో మనిషి కావాలి...!

# దళిత మధ్య తరగతి జీవితాన్వేషణ 'మన నవలలు-మన కథానికలు




ఈసారి కేంద్ర సాహిత్య అకాడమి తెలుగు సాహిత్యంలో విమర్శకు ప్రాధాన్యతను ఇచ్చింది. ఆ ప్రయత్నంలో భాగంగా రాచపాళెం ప్రచురించిన 'మన నవలలు-మన కథానికలు' వ్యాస సంపుటికి కేంద్ర సాహిత్య అకాడమి అవార్డును ప్రకటించింది. ఇది తెలుగు సాహితీవేత్తలకు, పాఠకులకూ చాలా సంతోషదాయకం, మన నవలలు-మన కథానికలు సంపుటి 24 వ్యాసాలతో సెప్టెంబర్ 2010లో ప్రచురితమైంది. ఇందులో 13 వ్యాసాలు తెలుగు నవలా సాహిత్యానికి సంబంధించినవి కాగా మిగిలిన 11 వ్యాసాలు కథానికా సాహిత్యానికి సంబంధించినవి.

-కె. మోహన్ బాబు
80089 04943

రాచపాళెం మార్క్సిస్టు దృక్పథం గల విమర్శకుడు పరిశోధకుడు. అనువాదకుడు విశ్వవిద్యాలయ అధ్యాపకులు. జన్మతః మధ్య తరగతి రైతు కుటుంబంలో జన్మించిన రాచపాళెం తాను వ్యవసాయం చేస్తూనే విద్యను ఆర్జించాడు. పరిశోధన చేస్తుండగానే విశ్వవిద్యాలయస్థాయి అధ్యాపకుడయ్యాడు. అప్పటి నుండి సంప్రదాయ సాహిత్యంతోపాటు ధ్వని, అలంకారం, రసం లాంటి అంశాలను, ఆధునిక సాహిత్యాన్ని బోధించడంలో భాగంగా, ఆధునిక సాహిత్య ప్రక్రియలను పాశ్చాత్య సాహిత్య విమర్శనాంశాలనూ అన్నింటి వర్తమాన సామాజిక స్థితిగతులను అధ్యయనం చేశాడు. ఇలా తన అధ్యాపక జీవితంలో ప్రాచీన ఆధునిక సాహిత్యాలను ప్రాచ్యపాశ్చాత్య విమర్శనా సూత్రాలను క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు.

ఆరంభంలో రాచపాళెం విమర్శ ప్రక్రియ పట్ల ప్రధానంగా దృష్టిసారించాడు. తెలుగు సాహిత్యమంటే కవిత్వం అనుకునే సమాజంలో ఆధునిక సాహిత్యంలో బాగా వెనుకబడిన నవల కథానిక లాంటి ప్రక్రియలను గుర్తించాడు. ఈ ప్రక్రియల మీద తన విమర్శనా దృక్పథాన్ని ప్రకటించాడు. మొదటగా "గురజాడ తొలికొత్త వెలుగు కథలు" అనే పేరుతో గురజాడ రాసిన అయిదు కథలను వస్తువు శిల్పం పాత్రలపరంగా విశ్లేషిస్తూ ఒక విమర్శనా పుస్తకాన్ని ప్రచురించాడు. ఈ పుస్తకం తెలుగులో కథా విమర్శకు పూనుకునే విమర్శకులకు ఒక ప్రమాణ గ్రంథంగా తోడ్పడింది. అలా రాచపాళెం సాహిత్య విమర్శ మొదలైంది.

ఈసారి కేంద్ర సాహిత్య అకాడమి తెలుగు సాహిత్యంలో విమర్శకు ప్రాధాన్యతను ఇచ్చింది. ఆ ప్రయత్నంలో భాగంగా రాచపాళెం ప్రచురించిన 'మన నవలలు-మన కథానికలు' వ్యాస సంపుటికి కేంద్ర సాహిత్య అకాడమి అవార్డును ప్రకటించింది. ఇది తెలుగు సాహితీవేత్తలకు, పాఠకులకూ చాలా సంతోషదాయకం, మన నవలలు-మన కథానికలు సంపుటి 24 వ్యాసాలతో సెప్టెంబర్ 2010లో ప్రచురితమైంది. ఇందులో 13 వ్యాసాలు తెలుగు నవలా సాహిత్యానికి సంబంధించినవి కాగా మిగిలిన 11 వ్యాసాలు కథానికా సాహిత్యానికి సంబంధించినవి. ఈ విమర్శ మొత్తం ఆయా

ప్రక్రియల్లోని 'వస్తు చర్చ' మీద విమర్శ సాగింది. ఈ సంపుటి 178 పుటలున్న వ్యాస సంకలనం.

ఈ పుస్తకం చాలా చిన్నగా కన్పించినా గత నూటా పాతిక సంవత్సరాల దళితుల బహుజనుల, గిరిజనుల సాంఘిక, ఆర్థిక, రాజకీయ తాత్విక, సాంస్కృతిక జీవన రంగాలను ప్రతిబింబిస్తుంది. నవలలు, కథానికలు ద్వారా వర్ణ వ్యవస్థ దాని మూలాలూ, కులాలు, ఉపకులాలు జరిగిన కులపోరాటలు, ఉద్యమాలు, దళితులు, బహుజనులు తమ విముక్తి కోసం సాగించిన ఉద్యమాలు, స్త్రీ పురుషుల సంబంధాలు స్త్రీ విముక్తి అస్పృశ్యత విషయంలో డా॥ బి.ఆర్. అంబేద్కర్ భావజాలం ఆ భావజాలం నీడన వెల్లివిరిసిన చైతన్యం, వర్ణవ్యవస్థను తిరస్కరిస్తున్న తీరు మీద లోతైన విశ్లేషణ వుంది. అలాగే రాయలసీమ కరువు జీవితం కరువులో భాగంగా మనిషిని సంక్షోభంలోకి నెట్టి ఫ్యాక్షనిజాన్ని బలోపేతం చేయడం డబ్బు నంచులతో కృష్ణాతీరంలోని భూస్వాములు, ఉత్తరాంధ్రకు తరలివెళ్ళి ఆ భూములను కొని ఆ ప్రాంతం భూయజమానులనే కూలీలుగా మార్చుకోవడం, తెలంగాణలో దళిత ఉద్యమాలు, ప్రపంచీకరణ సరళీకృత ఆర్థిక విధానాల మూలంగా సగటు మనుషులు తమ జీవితాన్ని నష్టపోతున్న వైనాన్ని విశ్లేషిస్తూ, వర్తమాన మానవ విముక్తి, సాధికారికతను సాధించడాన్ని మూలాలతో సహా విశ్లేషించింది. ఈ వ్యాస సంపుటి. నేటి తెలంగాణతో సహా సమగ్ర ఆంధ్రప్రదేశ్ గత నూటపాతిక సంవత్సరాల భౌతిక, సామాజిక స్వరూపాన్ని అందించిన ఉద్గ్రంథం ఇది.

ఈ వ్యాస నంపుటి మనకు రెండు భాగాలుగా దర్శనమిస్తుంది. మొదటిభాగంలో నవలల మీద రెండవ భాగంలో కథానికల మీద లోతైన విమర్శ కన్పిస్తుంది.

**ఈ వ్యాస సంపుటి మనకు రెండు భాగాలుగా దర్శనమిస్తుంది. మొదటిభాగంలో నవలల మీద రెండవ భాగంలో కథానికల మీద లోతైన విమర్శ కన్పిస్తుంది.**

'నిచ్చెనమెట్ల నమాజానికి నిలువెత్తు రూపం గద్దలాడతండాయి"లో తెలుగు ప్రజాజీవితంలో పరిమిత కులాలు పాలక సంపన్నవర్గంగా ఏర్పడి తక్కిన కులాలను పాలితులుగా మార్చి పెత్తనం చెలాయిస్తున్న తీరు మీద విశ్లేషణ జరిగింది. 'భూ సంస్కరణల బూటక చిత్రం అద్దంలో చందమామ'లో స్వాతంత్ర్యోనంతరం పేదరికాన్ని నిర్మూలించడంలో భాగంగా ప్రభుత్వాలు దళిత బహుజనులకు బంజరు భూములు ఇచ్చినా, ఆ భూమి తిరిగి భూస్వాముల చేతిలోకి వెళ్ళిన వైనం మీద విశ్లేషణ సాగింది. "పల్లెను నంస్కరించిన పల్లె పిలిచింది' వర్తమాన గ్రామీణ పునర్నిర్మాణంలో ఉపాధ్యాయుల పాత్రల మీద వస్తు చర్చ సాగింది. అలాగే "చీకటి రాజ్యంపై టార్చిలైటు" వ్యాసంలో భారతీయ వర్ణవ్యవస్థ మనుధర్మం మాటున చాతుర్వర్ణవ్యవస్థను సృష్టించి ఆ వ్యవస్థలో శాఖలను ఉపశాఖలను ఏర్పరచి, తద్వారా శ్రామిక వర్గాన్ని శాశ్వతంగా సుఖానికి దూరంచేసిన ప్రయత్నం మీద విశ్లేషణ జరిగింది. "వేర్లు నేర్పిన చదువు బోధి అందించిన జ్ఞానం" వ్యాసంలో భారతదేశంలో ప్రభుత్వం దళితుల సంక్షేమం కోసం ఏర్పరచిన రిజర్వేషన్లు దళితుల్లో అభివృద్ధి చెందిన ఒక వర్గమే అనుభవిస్తోందని, మిగతా అణగారిన దళితకులాలు ఈ రిజర్వేషన్ల ఫలాలు అందుకోవడంలేదనే అంశం మీద చర్చసాగింది.

"మాలపల్లి నవలా వైశిష్ట్యం"లో గత శతాబ్ది ఆరంభంలో సాగిన దళిత, కార్మిక సంఘసంస్కరణోద్యమాలు, వలసవాద పాలకుల పీడన పట్ల వ్యతిరేకత, నాటి సమాజంలోని స్త్రీ, పురుషుల సంబంధాలు మీద విశ్లేసణ సాగింది. అలాగే "కులాన్నే వర్గంగా ప్రతిపాదిస్తున్న పెన్నేటి మలుపులు" వ్యాసంలో రాయలసీమ ప్రాంతంలో అణగారిన దళిత శ్రామిక కులాలను సాంఘిక, ఆర్థిక, రాజకీయ నేపథ్యంలో వున్న సవర్ణ భూస్వామ్యవర్గం తమ గుప్పెట్లో పెట్టుకోవడం క్రమంగా శ్రామిక వర్గాలు భూస్వాముల మీద తిరుగుబాటు చేయడంపై లోతైన విశ్లేషణ జరిగింది. అలాగే "దళిత స్త్రీ చైతన్యం ఆకాశంలో సగం" దళిత స్త్రీ చైతన్యాన్ని ఆవిష్కరిస్తుంది.

'అంబేద్కర్ అడుగుజాడల్లో జగడం'లో వర్తమానంలో డా॥బి.ఆర్. అంబేద్కర్ భావజాలం మీద సాగిన దళిత చైతన్యాన్ని విశ్లేషించారు. "చేనుమేస్తున్న కంచెకు నిలువుటద్దం చీకటి పూలు" లో మధ్యతరగతి జీవనం దర్శనమిస్తుంది. అలాగే "యుద్ధం మీద ఫిర్యాదై తేలిపోయిన రక్తకాసారం"లో ఉత్తరతెలంగాణ ప్రాంతంలో సాగుతున్న మావోయిస్టు పోరాటాల్లో రెండు వర్గాలు చనిపోతున్నారనే విశ్లేసణ వుంది. అలాగే వట్టి కోట అళ్వారుస్వామి రాసిన 'ప్రజలమనిషి', డా॥ అంశయ్య నవీన్ రాసిన "ఉమెన్స్ కాలెజి" నవలలు మీద కూడా లోతైన విశ్లేషణ వుంది.

ఈ మొత్తం వ్యాసాల్లో విమర్శకుడు వస్తు చర్చకు

సంబంధించిన అంశాలను చర్చిస్తూనే ఈ రచయితల అభిప్రాయాలు ఆయా సందర్భాల్లో అవాస్తవాలయితే వాటిని ఎత్తిచూపే ప్రయత్నాలు చేశాడు. వస్తువు శిల్పం, పాత్రల విషయంలో, పలువాదాల విషయంలోనూ, ఆ రచయితలకు స్పష్టతను ఇచ్చే ప్రయత్నం చేశాడు రాచపాళెం.

ఇక కథానిక పరంగా ఆలోచిస్తే పలువురి రచయితల కథానికా సాహిత్యం మీద తమ స్వరాన్ని విన్పించే ప్రయత్నం చేశాడు. 'గుండెచప్పుళ్ళు - ఇసక కథలు' వ్యాసంలో రామలసీమ హిందూపురం ప్రాంతంలో కరువు, రైతు, వ్యవసాయం, ముఠాకక్షలు, ప్రభుత్వ అధికారుల్లో పెరుగుతున్న అవినీతి లంచగొండితనం వెరసి అనంతరైతు ప్రకృతి శాపానికీ 'ప్రభుత్వ విధానాలకు బలవుతున్న తీరు వ్యక్తమవుతుంది. అలాగే "కథానికాదండోరా - ఎదురు చూపులు" వ్యాసంలో సగటు భారతీయ మాదిగల కుల జీవితం, విద్యావిధానం, రిజర్వేషన్లు, స్కాలర్‌షిప్‌లు, దళితస్త్రీల మీద సాగే లైంగిక హింస మాదిగల ఆర్థిక దారిద్ర్యం లాంటి అంశాలమీద విశ్లేషణ కన్పిస్తుంది. "మారుతున్న ఊళ్ళ కథలు - ఒక రాత్రి - రెండు స్వప్నాలు"లో ఒకనాడు కృష్ణా తీరంలోని భూస్వాములు తమ డబ్బు సంచులతో శ్రీకాకుళం ప్రాంతానికి వెళ్ళి, అక్కడ భూములనుకొని, అక్కడి భూయజమానులను కూలీలుగా మార్చినవైనం, వర్ణ వ్యవస్థ చేస్తున్న వికృతి విన్యాసాలు విశ్లేషించబడ్డాయి. అలాగే "తెలుగు కథావీధిలో యజ్ఞం ఊరబావి"లో సమాజంలోని దళితులమీద సాగుతున్న ఆర్థిక దోపిడీ సాంఘిక అణచివేతలనూ ఎత్తిచూపే ప్రయత్నం చేస్తాడు.

'ఉద్యమానికి ఊపునిస్తున్న ఉపాధ్యాయ కథలు"లో 1948-1995 సం॥ల మధ్య కాలంలో వచ్చిన విద్యారంగం రుగ్మతల్ని, విద్య ఉపాధ్యాయ ఉద్యమాలకు సంబంధించిన విశ్లేషణ వుంది. "వినిర్మల సామాజిక స్వప్నంలో గాజు కళ్ళు"లో మధ్య తరగతి స్త్రీ, పురుషుల సంబంధాలు, స్త్రీ విద్య, స్త్రీ వివక్ష, స్త్రీల పట్ల మారాల్సిన పురుషుల ఆలోచనావిధానం లాంటి అంశాలు చర్చించబడ్డాయి. అలాగే చిత్తూరు జిల్లా నేపథ్యంగా డా॥వి.ఆర్.రాసాని రాసిన కథల్లో సామాజిక నేపథ్యంతో కూడిన వస్తువైవిధ్యం దర్శనమిస్తుంది. 'అభినందనలు - పొగబండినేస్తం"లో ఈ పురుషాధిక్య సమాజం నుండి ఆధునిక మహిళలు తమ జీవితాలను వ్యక్తిత్వాలనూ రక్షించుకోవాల్సిన అవసరత మీద విశ్లేషణ కన్పిస్తుంది.

"సామాజిక ఉద్యమాలు - తెలుగు కథానికా వికాసం" ఈ సంపుటిలో చాలా పెద్ద వ్యాసం విస్తృతమైంది కూడా. గత శతాబ్ది ఆరంభం నుండి సాగిన సంఘ సంస్కరణ అభ్యుదయ, జాతీయోద్యమం, తెలంగాణా విముక్తి ఉద్యమం, విప్లవం, స్త్రీవాదం, దళితవాదం, ముస్లిం, ప్రాంతీయ ప్రపంచీకరణ లాంటి ఉద్యమాల పరంగా తెలుగు కథానిక సామాజిక జీవితాన్ని ప్రతిబింబించిన తీరు విశ్లేషించబడింది. ఈ సుదీర్ఘ కాలంలో మధ్యతరగతి జీవితం వివక్షకు గురైన తీరు కూడా ఈ వ్యాసంలో మనం గమనించ వచ్చు. అలాగే "అయ్యో పాపం నుండి అగ్రహారం దాకా తెలుగు దళిత కథానిక"లో తెలుగు కథానిక దళిత జీవితాన్ని ప్రతిబింబించిన తీరు విశ్లేషించబడింది.

> ఈ మొత్తం వ్యాసాల్లో విమర్శకుడు వస్తు చర్చకు సంబంధించిన అంశాలను చర్చిస్తూనే ఈ రచయితల అభిప్రాయాలు ఆయా సందర్భాల్లో అవాస్తవాలయితే వాటిని ఎత్తిచూపే ప్రయత్నాలు చేశాడు. వస్తువు శిల్పం, పాత్రల విషయంలో, పలువాదాల విషయంలోనూ, ఆ రచయితలకు స్పష్టతను ఇచ్చే ప్రయత్నం చేశాడు రాచపాళెం.

ఇలా ఈ వ్యాస సంపుటిలో మొత్తంగా నూటాపాతిక సంవత్సరాల సామాజిక జీవనం వర్ణవ్యవస్థ, చాతుర్వర్ణం, కులాలు, ఉపకులాలు, అస్పృశ్యత, వివక్ష, భూస్వాముల దౌర్జన్యం, స్త్రీ పురుషుల సంబంధాలు, లైంగిక హింస, కరువు, ముఠాకక్షలు, ప్రపంచీకరణ, తెలంగాణా జీవితం, మాదిగల జీవితం, ఇలా అనేక అంశాల నేపథ్యంగా ఈ వ్యాస సంపుటి రాయబడింది. ఈ తర్వాత ప్రచురింపబడింది. ఇంతటి విశాల దృక్పథాన్ని కలిగివున్న ఈ వ్యాస సంపుటికి గానూ, ఆచార్య రాచపాళెం చంద్రపాళెం రెడ్డి గారిని కేంద్ర సాహిత్య అకాడమి అవార్డు వరించింది. ఈ అవార్డు రాచపాళెం నీతికి, నిజాయితీకీ, క్రమశిక్షణనూ, ఆరడుగుల వ్యక్తిత్వానికీ, ఆరడుగుల ఆత్మగౌరవానికీ, నిదర్శనం, రాచపాళెం ఈ అవార్డు పొందినందుకు తెలుగు సాహితీ ప్రపంచానికి ఆనందదాయకం, భవిష్యత్తులో వీరు మరిన్ని అవార్డులు అందుకోవాలని మనం ఆశిద్దాం.

# జీవన బాట

- ర్యాలి ప్రసాద్
9440478081

(సిపిఐ(ఎం) 21వ జాతీయ మహాసభల సందర్భంగా నిర్వహించిన పోటీలో తృతీయ బహుమతి పొందిన కవిత)

నీటి ఒడ్డున వికసించిన నాగరికతలో
నది మట్టిని పంటగా మార్చింది

రాళ్ళన్నీ పోగుపడి
పుట్టుకొచ్చిన వసంతంలో
మనిషిని నాగరికతా చిహ్నంగా
నిలిపిన వృత్తులన్నీ
కళావిహీనంగా రోదిస్తున్నాయి

అతనికంతా సృష్టించడమే తెలుసు
నిర్మించడమే తెలుసు
మట్టికి జీవంపోసి జాతినోటికి
అన్నముద్ద కావడం తెలుసు
రాగాల్నీ రుచుల్నీ పండించడం తెలుసు



ఆకుపచ్చ వెన్నెలతో
వాకిళ్ళను కళ్ళాపితో నింపడం తెలుసు
నమ్ముకున్న సిద్ధాంతంపై
దీపస్తంభంలా నిలబడడం తెలుసు

పావురాళ్ళను ఎగరేసే చేతుల నటనలో
తూటా దగ్గర నిలిచిపోయిన చివరి జ్ఞాపకమతను

పలకరింపులన్నీ వీడ్కోలైనపుడు
చెట్లకు తుపాకులు పూస్తున్నాయి

ఆయుధాలు నిద్రలేపే చోట
సూర్యుడున్నంత వరకూ అతనుంటాడు
అతను తూర్పునే ఉదయించాల్సిన
అవసరం లేదు
నల్లని చుక్క చూపుడు వేలిపై
చీకటై చరిత్ర పుటల మీద కాలాన్ని చెక్కుతుంది

ఆయుధానికై రాతికి పదునుపెడుతుంది మరోరాయి
నేల వీరుల నెత్తురు తాగాలని ఆశపడుతున్నపుడు
ప్రాణం పోరాటంలో పరాధీనమైనపుడు
మనిషొక దట్టించిన ఫిరంగి అవుతాడు

పోరును యాగమని నమ్మిన
వీరత్వం నేరముద్రను దాలుస్తుంది
కన్నీటి గీతకు అటూ యిటూ అతనే ఉంటాడు
జీవితాంతమూ అవనతమైన జెండాలా ఏడుస్తాడు

గోడల మీద కుళ్ళిపోయిన హామీల్లో
చిట్టచివరి యుద్ధాలకు ఊపిరిపోస్తున్నవాడు
ప్రతి మనిషిలో
ఎగిసే మంటల్లోను అతనే ఉంటాడు

సైనికుడు సమరాన్ని ప్రేమిస్తున్నాడంటే
దేశాన్ని గుండెల్లో నింపుకున్నట్టు...
వీరుడు పోరాటాన్ని మోస్తున్నాడంటే
ఉద్యమాన్ని శిరస్సుకెత్తుకున్నట్టు...
పౌరుడు పోరుకు సిద్ధమయ్యాడంటే
రాజ్యాన్ని ద్వేషిస్తున్నట్టు
అతని నైతిక విజయం
జారిపోయిన పరాజయాన్ని గుర్తుచేస్తుంది
గెలుపూ ఓటములు తప్ప
జీవితం లేకపోవడం విషాదం
మరణాన్నో, త్యాగాన్నో
మనమీద గురిపెడుతుంది కాలం

ఒకే ఒక్కనిలో కోట్ల జీవితాలు కొలువుంటే
చుట్టూ అనుమానం, పరీక్షలు, గాలింపులు
మలుపుల వద్దా, కూడళ్ళ వద్దా
నలుగురుండే చోటా నిఘా..!

అతని కోసం అడవుల్నీ యిళ్ళనీ
ఆఖరికి నీటినీ తగలబెడతారు
సామాన్య బతుకులు కూడా చరిత్రైనపుడు
ఒక ఆకలి చరిత్ర, కన్నీటి చరిత్ర
నెత్తుటి చరిత్ర, పోరాట చరిత్రే వాస్తవం.

గుండెను గుమ్మడికాయను చేసి
గుమ్మానికి వేలాడదీసిన తల్లుల నిరీక్షణలో
ఎక్కడో ఒక కన్నపేగు రోదిస్తూనే ఉంటుంది

వీరుడు శాంతికోసం యుద్ధం చేస్తే
ఉన్మాది హింసకోసం చేస్తాడు
ఉన్మాది వీరుడు కాదు
వీరుడెన్నటికీ ఉన్మాది కాలేడు

శత్రువు మిత్రుడై చేయి కలిపి
పావురాన్ని ఎగరేసే కుట్రలో
అతను నడచినంతమేరా
ఎర్రని పాదముద్రలు జీవన బాటలవుతాయి

# వచన కవిత్వం వస్తుశిల్ప వైవిధ్యం



- బిక్కి కృష్ణ
99127 38815

కవిత్వం ఇలా ఉండాలని ఎవరు చెప్పగలరు? చలం అన్నట్టు కవిత్వాన్ని తూచే తూనికరాళ్లు ఎవరిదగ్గరున్నాయి? కవిత్వానికి ఒక రూపం **(Form)** ఇలానే ఉండాలనీ, వస్తువును ఇలానే శిల్పీకరించాలనీ, ఎంత భావోద్వేగాల **(Emotional Feelings)** నైనా సౌందర్యదృష్టి **(Aesthetic sense)** తోనే అభివ్యక్తీకరించాలనీ నేటి కవితా నిర్మాణ కోవిధులు నొక్కి వక్కాణిస్తున్నారు. ఒక భావచిత్రమో, పదచిత్రమో, ప్రతీకో, ఏదో ఒక మసాలా దినుసు జోడించి, తన కిష్టమైన వస్తువును, తనదైన శైలి **(Style)** లో కవిత్వీకరించాలనీ... ఇలా ఎవరికి తోచినవిధంగా వారు కవిత్వంపై అభిప్రాయాలు వ్యక్తీకరిస్తుంటారు. అంతేగాక పూర్వ లాక్షణికులు చెప్పినట్టు ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసాలు కూడా కవిత్వం రాసేవారికి పుష్కలంగా ఉండాలంటారు. ఇలా పాపం కొత్తగా కలం పట్టిన కవులను భయపెడుతుంటారు. హృదయంలో కలిగే స్పందనల్ని అక్షరాల్లో తమదైన భావనల **(Feelings)** తోటి వ్యక్తీకరిస్తుంటే మధ్యలో ఈ విమర్శకుల గోలేమిటని పాపం కొత్త కలాలు గొణుక్కుంటాయి. ఇంతకూ కవిత్వం రాయటానికి ఎలాంటి అర్హత ఉండాలంటే మాత్రం ఎవరూ నోరు విప్పరు. కప్పి చెప్పువాడు కవి, విప్పి చెప్పువాడు విమర్శకుడని సి.నా.రే. ఏనాడో చెప్పాడు కదా? మేం కాస్త మా భావాలను కప్పి చెబితే తప్పేంటని కొత్త కవులు నిలదీస్తారు. నిజమే కవిత్వం రాసే వాళ్ళంతా కొత్తలో కొంత అస్పష్టత, కొంత సంక్లిష్టత, కొంత అయోమయం, కొంత అసంబద్ధత,పదాలకూర్పులో, పాదాల విరుపులో, భావాల మెరుపులో కొంత తత్తరపాటు పడినవాళ్లే! ఎందుకంటే ఏ కొత్త అలవాటైనా, నేర్చుకునే క్రమంలో లోపాలుండటం సహజమే! అయితే వాళ్ళు అక్కడే ఉండిపోలేదు. శ్రీశ్రీ మహాప్రస్థానం తర్వాత మరో ప్రస్థానం రాసి తన లోపాలు సరిదిద్దుకున్నాడు. అలాగే కె. శివారెడ్డి ఆసుపత్రిగీతానికి, మోహనా మోహనా కావ్యానికి ఎంతో పరిణతిని కనబరిచారు. శేషేంద్ర శేషజ్యోత్స్నకు, నా దేశం నా ప్రజలకు మధ్య వస్తురూప నిర్మాణాల్లో ఎంతో వైవిధ్యం కనిపిస్తుంది. అయితే శ్రీశ్రీ, శివారెడ్డి, శేషేంద్రలు ప్రపంచ సాహిత్యాన్ని బాగా చదువుకున్న మేధావి కవులు అవటంచేత వాళ్ళ కవితా నిర్మాణం విషయంలో చాలా జాగ్రత్తపడ్డారు. అయితే తిలక్ మాత్రం సహజంగా వస్తుతహ కవిగా రాణించారు. దానికి ప్రధాన కారణం ఏ దృశ్యం ఆయన కంట పడినా ఆ దృశ్యం తాలూకు సన్నివేశాలను తనదైన తాత్వికస్పర్శతో, స్పందనతో అద్భుతంగా కవిత్వీకరించేవాడు. తర్వాత తరంలో ఎందరో కవులకు ఆయన మార్గదర్శకు లయ్యారు. అందుకే వస్తు శిల్ప వైవిధ్యంతో కవిత్వం రాయగలిగారు. శేషేంద్ర కవిసేన మానిఫెస్టో ఆధునిక కవులకు ఒక పాఠ్యగ్రంధమనే చెప్పాలి. దేశవిదేశాల కవితారీతులు తెలిసిన శేషంద్ర కవిత్వాన్ని ఒక తపస్సుగా భావించి కవితలు రాశారు. కొత్త కొత్త ఇమేజన్‌లు వాడటంలో శేషంధ్ర సిద్ధహస్తులు. రసధ్వని అలంకారాదులు కవిత్వానికి ప్రాణమని

ప్రాచీన అలంకారికులు చెప్పారు. ఆనందవర్ధనుని ధ్వని సిద్ధాంతం, కుంతకుని వక్రోక్తి ఆరోజుల్లో అధునాతనమైన సిద్ధాంతాలైతే ఈ రోజుల్లో పాశ్చాత్యదేశాల కవుల కవితారీతుల్ని అనుకరించడమే సరికొత్త నిర్మాణ సిద్ధాంతాలుగా చలామణి అవుతున్నాయి. ఉపమలో కవిత్వంరాసే వాడు మామూలు కవి అని, రూపకంలో రాసేవాడు ఉత్తమ కవి అని, మెట ఫిజికల్ మెటఫర్‌లో రాసేవాడు అత్యుత్తమ కవి అని, మెటఫారిక్ కన్సీట్‌లో రాసేవాడు ఉత్తమోత్తమ కవి అని కాకుంటే నీచమోత్తమపు అత్యున్నత కవి అని 'మో' లాంటి వాళ్ళు పేర్కొన్నారు. జాన్డన్, యాండ్రూమార్వల్, డీసన్, ఏట్స్, ఇలియట్ లాంటి మహా కవులు అలాంటి కోవకు చెందిన వారు కావచ్చునేమెకాని అందరూ అంత గొప్ప కవిత్వం రాయకపోవచ్చు. అంత మాత్రాన తెలుగు కవులను తక్కువగా భావించనక్కరలేదు. ప్రతి కొత్త తరం తన అనుభవ వైవిధ్యాన్ని కవితా వైవిధ్యంలో గుప్తపరచుకుంటుందని ఎమర్సన్ అన్నాడు. కాకపోతే ఆ మూల కవితనో, మూల సంగీతాన్నో గుర్తించడం చాలా కష్టం. కొందరు వివిధ దేశాల కవిత్వాన్ని బాగా చదివి తమకు తెలియకుండానే వారి ప్రభావంతో కొన్ని అద్భుత కవితలు రాసి ఉండవచ్చు. అంత మాత్రాన వారిని కవితా నిర్మాణ దక్షులని అనలేంకదా? కవిత ఎత్తుగడ అనేకరూపాల్లో ఉంటుంది. వాక్యనిర్మాణం కూడా ఒకేవిధంగా ఉండదు. కొందరు చిన్నపాటి వాక్యాలు పేర్చి, కవితలు కూర్చితే, మరికొందరు సుదీర్ఘసమాసాలతో, కాంప్లెక్స్ వాక్యాలతో కలగాపులగం కవిత్వాన్ని పులిమి రుచి చూడమంటారు. వారి కవితా సంపుటాలను మనపై విసిరేస్తారు. చాలామంది అరిగిపోయిన ప్రతీకలను లేదా ఇంతకు ముందే వాడిన ఇమేజస్‌నే మళ్ళీ మళ్ళీ వాడుతూ కొత్తసీసాలో పాత సారాను నింపినట్టు కవిత్వాన్ని నిర్మిస్తారు. ఏంచేస్తాం కవులసంఖ్య ఎక్కువైపోయి ఏదన్నా ఒక కొత్త పదబంధాన్ని పట్టుకుందామంటే శ్రీశ్రీ అన్నట్టు దాన్ని ఇంతకుముందే ఎవడో ఒకడు వాడేసుకుని ఉంటాడు. అప్పుడేం చేయాలి? ఎవరూ చూడని, ఎవరూ చదవని ఏ విదేశ కవి కవిత్వాన్నో, ఏ ఇతర భాష కవుల కవితా శిల్పాన్నో కొంత మార్పు చేర్పులతో కాపీ కొట్టక తప్పని పరిస్థితులున్నాయంటారు పాపం నేటి కవులు. నిజమే వారుమాత్రం ఏం చేస్తారు? అందుకే ఎలాగో తమ కవిత్వాన్ని మార్కెట్ చేసుకోవడానికి ఏ సమీక్షకుణ్ణో, విమర్శకుణ్ణో కాకాపట్టి తన కవిత్వానికి ముందుమాటనే ఐ.ఎస్.ఐ ముద్ర వేయించుకుంటారు. అలా తాము కవులుగానే బతికున్నామనుకుంటూ సంబర పడిపోతారు. కవిత్వంలో ప్రసార గుణముండాలని, భావనాబలం ఉండాలని, సింబాలిజం ఉండాలని, మామూలుగా మనం మాట్లాడుకునే భాషే ఉండాలని, తలను దువ్వుకున్నట్టు కవిత్వ భాషను కాస్తా దువ్వాలని, ఫ్యాషన్ డిజైనింగ్ లో మాదిరి కవిత్వంలో వాడే పదాలను జాగ్రత్తగా పొదగాలని, వాక్యాల్లో డ్రైవింగ్ ఫోర్స్, ఏదో ఒక ఫోర్స్, నీరసం లేని సోర్స్ ఒకటి ఉండాలని కవితానిర్మాణ నిపుణులంటారు. సంస్కృత పదాలను ఇంగ్లీష్ పదాలను సాధ్యమైనంత వరకు వాడకూడదనీ, ఎవరో వాడిన ప్రతీకలను భావ చిత్రాలను, పదబంధాలను మనం మళ్ళీ మళ్ళీ ఉపయోగించరాదనీ, కవిత ఎత్తుగడ ముగింపు శీర్షికకు ఆకర్షణీయమైన పేరు పెట్టడం చాలా ముఖ్యమన్న సంగతి కొత్తగా కలం పట్టిన కవులు గుర్తించాలి. కాపీ కొట్టడం కూడా ఒక కళ అని మరీ తప్పని పరిస్థితుల్లో విదేశీ కవితలను అనుకరించాలనుకుంటే, లేదా అనుసరించాలనుకుంటే మక్కికి మక్కి కాకుండా కాస్త మార్పు చేర్పులతోనైనా తెలివిగా కాపీగొట్టి నాజుకుగా కవితా నిర్మాణం చేపట్టాలని సీనియర్ కవులకు తెలిసినట్టు పాపం చాలామంది యువకవులకు తెలియకపోవడం జాలి కలిగిస్తుంది. కాపీకొడితే మొదటి వాడి కవిత కన్నా రెండోవాడి కవిత గొప్పగా ఉండేలా కాపీ కొట్టాలంటారు కాపీఎక్స్‌పర్ట్స్. అప్పుడెప్పుడో నన్నయ అక్షర రమ్యతను కాదని తిక్కన నాటకీయతను ప్రవేశపెట్టాడు. తిక్కన నాటకీయతనుకాదని ఎర్రన వర్ణనా నైపుణ్యంతో పద్య కవిత్వాన్ని రక్తి కట్టించాడు. కాని ఇప్పుడు అలాంటి పప్పులుడకవు. ఎందుకంటే వచన కవితా రీతులు ప్రపంచమంతా దాదాపు ఒకేలా ఉంటాయి. కవిత్వాన్ని నిర్మాణ వైవిధ్యంతో రూపొందిస్తామంటే కుదరదు. మహాఅయితే దీర్ఘకవితలకు ముక్కలు ముక్కలు చేసి ఏ నానీలుగానో బతానీలుగానో, రెక్కలుగానో సుద్దముక్కలుగానో, నాలుగు అక్షరాల మినీ కవితగానో రాసేసుకుంటామంటే ఎవరికీ అభ్యంతరం లేదు... (ఆ విధంగానైనా కవిత్వం రాయడానికి పిల్లలు సాహసిస్తారు) అది సరే, ఇప్పుడు ప్రపంచ వ్యాప్తంగా వచన కవిత్వం ఎలా ఉండాలో కొందరికి బాగా తెలిసిపోయింది. ప్రాచీన లాక్షణికులు చెప్పిన వ్యుత్పత్తి ప్రకారం అందరూ విధిగా అన్ని దేశాల కవిత్వాల్ని చచ్చినట్టు చదివి తీరాల్సిందే! అలాగే నిరంతర అభ్యాసం (ఇది కూడా లాక్షణికులు చెప్పిందే)తోనే కవితా నిర్మాణం రాటుదేలుతుందని, ఇక ప్రతిభ వాడి వాడి బుర్రలోని మెదడు పరిణామాన్ని బట్టి ఉంటుందని (ప్రతి వాడికి బుర్ర

**కొత్త కొత్త ఇమేజస్‌లు వాడటంలో శేషంధ్ర సిద్ధహస్తులు. రసధ్వని అలంకారాదులు కవిత్వానికి ప్రాణమని ప్రాచీన అలంకారికులు చెప్పారు.**

పెద్దగానే ఉంటుంది) సోమరితనం వల్ల మనం సృజనాత్మకతకు పదునుపెట్టి మంచి కవిత్వం పండించలేక పోతున్నామని తెలుసుకోలేకపోతున్నారు. పొదగకుండానే గుడ్డును పిల్లను చేయడానికి కోడికూడా ప్రయత్నించదు కదా? మరి అలాంటపుడు కనీస జ్ఞానం లేకుండా, సృజనాత్మకత లేకుండా, నాలుగు కవితా సంపుటాలు చదువకుండా, శ్రద్ధలేకుండా అభ్యాసం లేకుండా కవిత్వం రాయడానికి మనిషి ప్రయత్నించడం హాస్యాస్పదం కాదా? వృత్తిపనివాళ్ళు ఆయా వృత్తుల్లో నైపుణ్యం సంపాదించకపోతే అభాసుపాలైనట్టు కవిత్వం రాయడం వృత్తిగాలేకున్నా కనీసం ప్రవృత్తిగా నైనా బాధ్యతతో చేపట్టకుండా కాలక్షేపానికనో, కీర్తిని సమాజ బ్యాంకులో డిపాజిట్ చేసుకుందామనో ప్రయత్నిస్తే నిజంగానే నవ్వులపాలవుతారు. కవిత్వంకాని కవిత్వాన్ని పదుల సంఖ్యలో సంపుటాలుగా ముద్రించుకుని కవుల మనుకుంటూ భ్రమల్లో ఎందరో జీవిస్తున్నారు. అలాంటి వారికి ఏదేని సంస్థ శిక్షణ నివ్వడానికి ముందుకొస్తే బావుంటుంది. కారణాలేవైతేనేం ఇటీవలి కాలంలో కవిత్వంలో రాసి పెరిగి, వాసి తగ్గిందన్న దాంట్లో కొంత నిజం లేకపోలేదు. కాని కవిత్వం రాస్తే వెన్నెల కురిసినట్టుండాలి. అమృతం కురిసినా అగ్నిని విరజిమ్మినా (తిలక్) కవిత్వం కవిత్వంగా భాసించాలి. గుండెలతో సంభాషించాలి. అనుభూతి పరిమళాలతో జీవితాలను మత్తెక్కించాలి. లేదా ప్రజా సమూహాలను ఉద్యమాల ప్రవాహాలుగా మార్చేయగలగాలి. అందరూ కాళిదాసులు శ్రీశ్రీలు శివసాగర్లు శివారెడ్డిలు కానక్కరలేదు. కనీసం వస్తువును శిల్పంగా మార్చడం పట్ల బాధ్యతగా వ్యవహరించాలి. కాళిదాసు స్థల కాలాలను బట్టి గొప్ప కవిత్వం రాశాడనీ, అది ఈ నాటికీ ఏనాటికీ వర్ణనానైపుణ్యం, ఉపమలవల్ల గొప్పగానే ఉంటుందన్న విషయం అందరికీ తెలిసిందే. అయితే ఈ నాటి సంక్లిష్ట సామాజిక పరిస్థితుల దృష్ట్యా అందరూ కాళిదాసులాంటి కవిత్వం రాయడం సాధ్యపడకపోవచ్చు. అంతేకాదు శ్రీశ్రీలా కూడా రాయలేమని చేతులెత్తేస్తున్నారు. అయితే నేటి కవుల్లో కొంతమంది ప్రపంచీకరణ, జీవావరణ విధ్వంస మూలాల్లోకెళ్ళి వస్తువును గొప్ప శిల్పంతో బలమైన అభివ్యక్తితో కవిత్వీకరిస్తున్న విషయాన్ని కొత్తగా కలం పట్టిన కవులు గమనించాలి. సినిమా పాటల్లో మాదిరి అల్లిబిల్లి పదాలతో లొల్లి కవిత్వాన్ని రాయడానికి ప్రయత్నించడం వల్ల ప్రయోజనముండదని యువకవులు కవయిత్రులు గుర్తించాలి. అయితే కొత్తవాళ్ళలో కొంతమంది మేధస్సుతో కాకుండా హృదయంతో కవిత్వం రాస్తున్నందుకు వారిని అభినందించాలి! కవిత్వం రాయడానికి అర్హత పనికిరాని యూనివర్శిటీల డిగ్రీలు జ్వరంతో రగిలి పగిలి పొగిలి కవిత్వమై జ్వలించే జీవితం కావాలి. అందుకే ఫైర్ లాంటి కవిత్వం రాయాలంటే **Powerful feelings** కావాలని, ఆ భావావేశం నుంచే పదాలు **Over flow** లా ఎగసి, కవితలు హృదయం నుండి పెల్లుబికి వస్తాయని వర్డ్సువర్త్ అన్నారు. వాక్యం రసాత్మకం కావ్యం అని అనటంలోని అర్థం వాక్యాన్ని కవిత్వం చేయటమే! వాక్యాన్ని కవిత్వం చేయాలంటే కవికి రసాత్మక హృదయం ఉండాలి. కళాత్మక దృష్టి ఉండాలి. ఇక్కడ కళాత్మకదృష్టి అంటే కవితా నిర్మాణ దృష్టి. దీన్నే పాశ్చాత్యులు రూపవాదం (Form) అన్నారు. ఈ విషయాలను దృష్టిలో ఉంచుకుని మంచి కవిత్వం రాయడానికి ప్రతి ఒక్కరూ ప్రయత్నిస్తారని ఆశిద్దాం. ❧

## ఏప్రిల్ నెల పురస్కారాలు



**పెట్టుడు రెక్కలు**
కథకు: రూ.700/-
రచయిత : జంధ్యాల రఘుబాబు

**కర్తవ్యం**
కవితకు : రూ .500/-
రచయిత : ముర్తుజా.ఎస్



సినీ రచయిత జనార్ధన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

◆

వ్యాసం : **రాయలసీమ తొలికథ** రచయిత : డా॥ తవ్వా వెంకటయ్య



ఈ రచయితకు 'కర్లపాలెం రుక్మిణమ్మ స్మారక పురస్కారం రూ.500/- అందజేయబడుతుంది

◆

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.

- ఎడిటర్

కథ

# ఒట్టిపోయిన మంత్రం

- చొప్ప వీరభద్రప్ప
94924 50984



బగురప్ప గొర్రెల కాపరి. తాను ప్రేమతో పెంచుకున్న నల్ల మేకపోతు కనిపించలేదని ఉదయమే తెలిసింది. అప్పటి నుండి మనసు మనసులో లేదు. అది అర్ధరాత్రి వరకు తన ప్రక్కనే పడుకుంది. రాత్రి తన కావలి వంతు అయిపోగానే నిద్రపోయాడు.

తన ఆరువందల గొర్రెల మంద అంతటా వెతికాడు. తన తర్వాత కావలి వంతు వున్న వారందరిని అడిగాడు. వారు తెలియదన్నారు. అనుమానపడటానికి, అందరూ తమ్ముళ్ళే సమిష్టి కుటుంబం వారిది.

దాని తల్లి గాలికుంటు వ్యాధితో చనిపోతే, ప్రత్యేక శ్రద్ధాసక్తితో కన్న కొడుకువలె కాపాడుకొచ్చాడు. పని వుండి, ప్రక్క వూరి నుండి తిరిగి వస్తుంటే తన కోర చెప్పుల శబ్దం విని ఆ మేకపోతు మేమే అని అరుస్తూ ఎదురు వచ్చి, అది వెనుక కాళ్ళపై నిలిచి రెండుసార్లు దాని తలతో చేతులకు ఢీ తగలంది నెమ్మది పడదు.

సూర్యోదయంతో గొర్రెలను మేతకు లేపి ముందుకు తోలితే అవి కదల్లేదు. అతని తమ్ముళ్లు బగురప్ప వైపు చూచి నీ ముద్దుల కొడుకు ముందు నడవంది ఈ పొద్దు మంద ఎట్లా నడుస్తుందప్పా అని అంటే అతని కన్నుల నీరు తిరిగాయి. మేకగాని మేకపోతుగాని మంద ముందు నడిస్తేనే, గొర్రెలు వాటి వెనుక పోతాయి. అది ఆ జాతి లక్షణం.

ఆ పూటకు వేరే మేకలను మంద ముందు చేర్చి తమ్ముళ్ళకు జాగ్రత్తలు చెప్పి, గొర్రెల మంద కదలి పోతుంటె చూస్తూ నిలబడ్డాడు.

నల్లమేకపోతు రూపకాంతులు, తెరలు తెరలుగా అతని మదిలో కదలి వస్తున్నాయి. తాను కొండ గుట్టల వైపు సాగిపోతున్నాడు. అమావాస్యకు ముందు రోజు తమ నల్లమేకపోతులు తప్పిపోయాయని, వేరే గొర్రెల కాపర్లు వెతుకుతూ, తన మందలో చూచి పోవడం గుర్తుకొచ్చింది. నల్లమేకపోతులు మాత్రమే పోవడం కారణమేమై వుంటుంది.

ఇది క్రూర జంతువుల పనీ కాదు. దొంగల పనీకాదు. దీనికి వేరే ఏదైనా కారణమున్నట్లుంది. అది ఏమిటనే ప్రశ్న మెదడులో పురుగైంది. ప్రశాంత సరస్సులో చిన్న రాయి వడ్డప్పుడు లేచే అలల తరంగాలవలె అతని మదిలో సంఘటలెన్నో ముసురుకున్నాయి.

స్పృహలేని నడకలో ఉద్విగ్న భావోద్వేగం కమ్ముకుంది. మనోగవాక్షంలో ఆశాకిరణం మనస్సును తాకి పళ్ళసందున నవ్వు ఇరుక్కొని బయటికి రాక తన్లాడి తలవూపి స్థిరపడింది. అప్పటికే అతడు సాంబ్రాణి కొండ ప్రక్క చేరాడు. ఆ కొండపై రాళ్ళన్నీ నల్లనివే. అవి కాటుక నలుపులో వుంటాయి. క్రమంగా అవి సాంబ్రాణి వాసన వస్తూ వున్నందున కాటు కొండ పేరు పోయి సాంబ్రాణి కొండైంది. అది నిటారుగా వుంటుంది. గొఱ్ఱెలు మేస్తూ జారిపడిపోతాయని గొఱ్ఱెల కాపర్లు అవైపు మేతకు తమ గొఱ్ఱెలను తోలికొనిపోరు. ఎందుకంటే అక్కడ నల్లమేకపోతులు ఆ కొండపైకి పోతే నల్లరాళ్ళయి పోతాయని సత్యం తెలియని కావర్ల మూఢవిశ్వాసం. కొందరు అనుభవంతో చెప్పిన విషయం బగురప్పకు గుర్తొచ్చింది. కొండ మధ్య పెద్ద గని వుంది. అందుండి ఎప్పుడు పొగలు గ్రమ్ముతూ సాంబ్రాణి వాసన వస్తూ వుంటుందని, అక్కడ ఋషులో మంత్రగాళ్లో వున్నారని ప్రతీతి. సాంబ్రాణి ఒక ప్రత్యేకమైన చెట్టు నుండి లభిస్తుంది. అక్కడి రాళ్ళు సాంబ్రాణి వాసన వస్తున్నాయంటే ఇదేదో మిస్టరీగా వుంది. దాన్ని ఛేదించాలనుకున్నాడు.



బగురప్ప హేతువాది. ఏదీ సులభంగా నమ్మడు. నాకు తెలిసి ఋషులెవ్వరు అక్కడ వుండరు. ఇది ఏదో మంత్రగాని వనే అయివుంటుందని బయలుదేరకముందే స్థిరపరచుకున్నాడు.

గాలి అలల పొంగులో సాంబ్రాణి వాసన గుప్పుమంది. కొండ మధ్య భాగానికి చేరాడు. పెద్ద రాతి గుండు ప్రక్క పొదనుండి వాసన వస్తున్నట్లు పసిగట్టాడు. బాణా కట్టి పొదలోనికి దూర్చి తీగలను కొంచెం పైకెత్తి చూశాడు. గనిలో మనక చీకటి వుంది. ఇది నూనె దీపపు కాంతి అని గమనించాడు.

పశ్చిమం శిథిల సంధ్యారాగం గగనంలో రుధిరం గక్కుతూంది. చీకటి క్రమ్ముకొస్తూంది. ఆకాశంలో నక్షత్రాలు ఒక్కొక్కటి మిణుక్కుమంటున్నాయి. మదిలో వివేచన మొలకెత్తింది. భుజంపై వున్న నల్ల కంబళి కప్పుకున్నాడు. బోర్లపండుకొని శబ్దం లేకుండా ప్రాకుతూ మంత్రగానికి అతి సమీపానికి చేరాడు.

మంత్రగాడు గుహమధ్య ఎర్రని నిప్పులపై ఏవేవో పిచ్చి శబ్దాలు పలుకుతూ తెల్లని బూడిద వంటిదేదో వేస్తున్నాడు. అది అగ్నిపై పడగానే మంట పైకెగసి నాలుక చాస్తున్నది. వాని ముందు ఎర్రని, నల్లని పసుపపచ్చని కుంకుమ తెల్లని విభూతితో కలిపి భయంకరంగా వేసిన యంత్ర, తంత్రపు ముగ్గుపై మూతి బిగించి కట్టిన మేకపోతు అన్ని వైపుల కదలకుండ కట్టివేయబడి వుంది.

బగురప్ప హృదయం భగ్గుమంది కోపం కట్టలు తెంచుకొచ్చింది. ఒక్కవేటున వాని తల వగల గొడదామనుకున్నాడు. పనిలో తొందరపాటున, వేసే అడుగు, అపజయానికి మొదటి మెట్టవుతుందని వూరకున్నాడు. మంత్రగాడు మాత్రం శబ్దంలో లీనమై తన్నుతాను మరచాడు. కనిపించే ఆ భయంకర ముగ్గుచూచి కన్నులు చలించాయి. మనుపెన్నడు అలాంటి ముగ్గు చూడనందున కొంచెం భయమావహించి, పూనకం వచ్చినట్లయింది. అతడు మనోనిబ్బరం గలవాడయినందున ధైర్యాన్ని మించిన మిత్రుడు లేడు. వివేకం వుంటే రక్షణ వేరే అక్కరలేదని, అతని మదిలో ప్రేమతో పెంచిన "నల్లమేకపోతు" నిండివుంది. దాన్ని రక్షించాలనే సంకల్పం మంచిదై వున్నందున తనకు కావలసిన శక్తి దానంతట అదే వస్తుందనుకున్నాడు.

పూజ ముగించి మంత్రగాడు మేకపోతును బలి ఇవ్వడానికి పైకి లేచి కత్తి తీసికొని, అక్కడ తాను స్థాపించిన దేవతకు చూపి పసుపు కుంకుమ పూసిన నల్లరాతికి మొక్కాడు. అంతలో బగురప్ప పైకి లేచి కంబళి తీసివేసి, మేకపోతు వున్న ముగ్గుపై నిలిచాడు. అతన్ని చూసి మంత్రగాడు బగురప్పతో ఎవరు నీవు ఇక్కడికెలా వచ్చావు ప్రాణంపై ఆశ లేదా అని గద్దించి అడిగాడు.

బగురప్ప అన్నాడు. నాకు, నా ప్రాణాలపై ఆశలేకేమి దండిగా వుంది అన్ని ప్రాణులు ఆశతోనే బతుకుతున్నాయి. నీవు కూడా ఆశ కోసం నా నల్ల మేకపోతును దొంగిలించుకొన్ని వచ్చావు. ఒక దొంగగానికి నేను భయపడేదేంది అన్నాడు.

మంత్రగాడు కత్తి ఎత్తి వూగుతూ ముందు నిన్ను బలి ఇస్తానన్నాడు. దానికి బగురప్ప నీకు మంచి జరిగితే అలాగే చెయ్యి నా మేకపోతును ఎందుకు బలి ఇస్తున్నావో ముందు చెప్పి తర్వాత బలి ఇవ్వమన్నాడు.

నీకెందుకు చెప్పాలన్నాడు మంత్రగాడు.

ఇది నాది కాబట్టి నేను ముద్దుగా సాకిన పోతుపిల్ల కాబట్టి నీవు చెప్పితీరాలి. నీవు దొంగవు. నీ దొంగతనాన్ని, ఇతరుల కష్టార్జితాన్ని బలవంతంగా లాక్కోవడం నీ దేవత ఎట్లా

సమ్మతిస్తుంది. ముందు నా మాటకు సమాధానమివ్వమన్నాడు బగురప్ప.

ఎవ్వరు వీడు నాకు ఎదురు తిరగకుండా ప్రశ్నలు వేస్తున్నాడని ఆశ్చర్యమైంది మంత్రగానికి. ఈ బలి 108 వది. ఇది జరిగితే నాకు మాయమయ్యే శక్తి వస్తుందన్నాడు బగురప్పతో.

నీవు నిజంగా మాయమైపోతావా.

ముమ్మాటికి నిజం

అలాంటి శక్తి రాకపోతే? ఏమి చేస్తావు నీ వుత్తుత్తి మంత్ర తంత్రాలు నేను నమ్మనన్నాడు బగురప్ప.

మంత్రగాని నుండి జవాబు రాలేదు.

బగురప్ప తిరిగి అడిగినాడు. మీ మంత్రగాళ్ళు దయ్యాల పేరుతో ఏవేంవెూ చేస్తున్నారు. దయ్యాలున్నాయా? నీవు చూచినావా? నీ దేవత ముందు సత్యం చెప్పమని గద్దించి అడిగాడు.

నేను చూడలేదన్నాడు మంత్రగాడు.

దయ్యం పట్టడం, ఒక మానసిక రోగం. సరియైన మందులిచ్చి మనస్సుకు ప్రశాంతత చేకూర్చితే ఆ రోగం పోతుంది. అట్లా కాకుండా ఇంకా భయపెట్టి ఆ రోగాన్ని మీ మంత్రగాళ్ళు పెంచుతున్నారని చెప్పినాడు.

ఏదీ! నీ మంత్రం నా మీద ప్రయోగించు ఏమవుతుందో చూస్తానని తెగింపుగా అడిగాడు.



మంత్రగాడు, ఏమీ మాట్లాడలేదు.

మంత్రగాడన్నాడు నాకు గురవు నేర్పాడు.

వానితో బగురప్ప చెప్పాడు ఓ మంత్రమయ్యా! పొట్టకూటికి నేర్చితే మంచిదే. దాంట్లో మోసం, దుర్మార్గం దాగివుంది. మితిమీరిన స్వార్థచింతనతో ఆర్జించే ప్రతిఫలాపేక్ష దుఃఖ హేతువు. నీవు అట్టి దాంట్లో, కొట్టుమిట్టాడుతున్నావు. కోరికలనే తాళ్ళతో బంధింపబడి నీ మనస్సు మలినమైనందున నీకు నిశ్చలత లేదు. అంతేగాక మూఢ విశ్వాసం మనిషిని మూర్ఖున్ని చేస్తుంది. నేను చెప్పిన తర్వాత ఆలోచిస్తున్నావు. నిజంగా మాయమయ్యే శక్తి వస్తుందా! రాదా! అనే మీమాంసలో వున్నావు. సంశయాత్మకమైన మనస్సు నిన్ను పీడిస్తూ పిచ్చివాణ్ణి చేస్తూంది. నీవు ఎన్ని నల్లమేకపోతులు బలి ఇచ్చినా బూడిదలో పోసిన పన్నీరే. పైగా నిజమైన ఆనందం తెలియక దాన్ని వదలి నిత్యం భయంతో ఎవ్వరి కంటికి కనిపించక, ఎవ్వరితోను మాట మంచి లేక నీలో నీవే అభద్రతా భావంతో సంచరిస్తున్నావు. ఇట్లాంటి బతుకు వున్నా ఒక్కటే పోయినా ఒక్కటే. ఆ మాయమైపోయే శక్తి వచ్చినా దాంతో నీవేమి చేసుకుంటావు. నీకు సుఖమెక్కడుంది. పరపీడనతో బతుకుతున్నావు. అదీ ఒక బతుకేనా? ఆలోచించుకొమ్మన్నాడు.

మంత్రగాడు ఆలోచనలో పడ్డాడు. అతడు చెప్పింది నిజమే. నేను మంత్రంలో వున్నాను. అతడు నా యంత్ర, తంత్రంతో వేసిన ముగ్గుపై వున్నాడు. అతడు రక్తం కక్కుకుని చస్తాడని గురువు చెప్పాడు. అతడు చావలేదు. నా మంత్రం వీగి కాటుపోయింది. నేను వంటరి జీవితం గడుపుతున్నాను. కడుపుకు అన్నంలేదు. స్వేచ్ఛ లేదు. ఆకలితో మంత్ర జపం చేస్తున్నాను. నన్ను ఎవరు ఎప్పుడు చూస్తారో! చూస్తే వారు నన్ను ఏమి చేస్తారో! ననే భయంతో జీవనం చేస్తున్నాను. అతడు చెప్పిన దాంట్లో నిజముంది. ఎప్పుడు నల్లకోడి, నల్లమేకపోతు, వంటి నలుపే మంత్రగాళ్ళు కోరుకుంటారు. నలుపు అజ్ఞానానికి ప్రతీక. నేను అజ్ఞానిని. ఎప్పుడు రక్తం, చావు, చంపడాలే నా నోట వినిపిస్తున్నాయి. ఇది హేయమైన జీవితమనుకున్నాడు.

ఎప్పుడైతే మనం వేసే ప్రశ్నకు సమాధానం లభించకపోతే ఎదుటి వ్యక్తిని నగం జయించినట్లేనని, బగురప్ప చిరునవ్వు నవ్వాడు. మంత్రగానితో అన్నాడు. ఈ మేకపోతును నేను ప్రాణంగా పెంచుకున్నాను. దీనిపై నీకు ఏమధికారముంది. నీవు ఇన్నేళ్ళు వ్యర్థంగా దేనికోసమో తపస్సు చేశావు. ఆలోచించు. తమ తప్పు తెలుసుకునే వాళ్ళు ఉత్తములు. ఆ మంత్రాలు నేర్వకుండా ఒళ్ళు వంచి పనిచేసి వుంటే నీ బతుకు బంగారమయ్యేది. నీవు వివాహం చేసుకొని భార్య పిల్లా పాపలతో సుఖంగా వుండేవాడివి. అప్పుడు నీకు ఆనందమయ జీవితమబ్బేది. నేను నీకు నీతులు చెప్పడంలేదు. సత్యము చెప్పుతున్నానన్నాడు.

అతడు నోరు విప్పలేదు.

తమ్ముడూ నిన్ను చూడగా చిన్నవాడవుగా వున్నావు. నిన్ను నీవు పరీక్షించుకో, వద్దనను. నేనిక్కడే ఈ ముగ్గుపైననే వుంటాను మేకపోతును బలి ఇవ్వు. నీకు నిజంగా మాయమైపోయే శక్తి వస్తే! నీవు పూజించే దేవియో, దేవతో ప్రసన్నమై నీకు శక్తి ఇస్తే వెంటనే నన్ను కూడా బలి ఇవ్వు. నీ మంత్ర యజ్ఞం ఇలాగే కొనసాగించుకో లేదా నన్ను బలి ఇవ్వకుంటే నేను నిన్నంటివుండి నా సమస్తము వదలి నీ వెంట వస్తాను. అది వ్యర్థమైతే, తమ్ముడూ నా వెంటరా! బాగా ఆలోచించుకో, చెట్లకు వేర్లు ఎటువంటివో మనం చేయబోయే పనులకు సదుద్దేశాలు అలాంటివి. నీవు చేయబోయే పని సదుద్దేశ శూన్యం. నన్ను నమ్ము. నా వెంటరా! నీ శిథిలమైన బతుకునకు వెలుగు నింపుతానని చెప్పి అక్కడే చీకటిని మింగుతూ కళ్ళు మూసుకొని నిలుచున్నాడు.

# స్థిత ప్రజ్ఞ

- మల్లారెడ్డి మురళీ మోహన్
88611 84899

కన్నీరు...
అమ్మ గుర్తొచ్చినపుడు
రెప్పల ఆనకట్టలు తెంచుకుంటుంది
అమ్మని గూర్చి రాసినపుడు
అలవోకగా జారుతుంది

అదే కన్నీరు..
ఆపేక్ష అతిశయించినపుడు
ఆశువుగా కరుగుతుంది
ఆకలిని గూర్చి రాసినపుడు
అగ్ని ధారగా చిమ్ముతుంది

అదే కన్నీరు...
వింటున్న పాటలో



అతని పదవైచిత్రిని పట్టుకోవడానికి
పరిగెత్తుకొస్తుంది
ఆ స్రష్ట స్వర విన్యాసానికి
మైమరచి ఎండి చారలు గట్టి
చప్పట్లు కొడుతుంది

అదే కన్నీరు...
మోదమైనా, ఖేదమైనా
ఒకేలా ప్రవహించి
'స్థిత ప్రజ్ఞత' ప్రదర్శిస్తుంది

---

మేక బలి పశువైంది. రక్తం చిమ్ముతూ తన్లాడింది. ఏ దేవతా ప్రత్యక్షం కాలేదు. తాను, తానుగానే వున్నాడు. మాయమైపోలేదు. ఇప్పుడు మంత్రగాడు మానసిక బలి పశువైనాడు. మంత్ర తంత్రాలు ఒట్టిపోయాయి. ఇన్నేళ్ళు తాను శ్రమించి కట్టుకున్న గాలి మేడలు కుప్పగా కూలిపోయాయి. కల కరిగి నీరై నేల దొర్లింది.

వివేకవంతుడు స్వానుభవం వల్ల ప్రయోజనం పొందితే తెలివిగలవాడు ఇతరుల అనుభవం వల్ల నేర్చుకుంటాడు.

మంత్రగాడు ఆలోచించాడు. నాది నీచ వృత్తి. దానివల్ల నాకు ఎలాంటి సుఖం వుండదు. అతడు చెప్పినదాంట్లో సత్యముంది. మా గురువు ఏదో సాధించినాడని చెప్పేవాడు. ఆయన ఎన్నో ఏండ్లుగా ఈ యజ్ఞం చేస్తున్నాడు. ఆయనకు నీటిపై, గాలిపై తేలే శక్తి వుందనుకున్నాను అని అన్నాడు. దానికి బగురప్ప అది యోగ విద్య. ఒక ప్రత్యేక సాధన ద్వారా ఊపిరితిత్తులలోనికి గాలి పీల్చుకుంటే శరీరం తేలికౌతుంది. దీనికి హింసతో కూడిన బలులివ్వడం అవసరం లేదు. నేటికీ కొందరు యోగ సాధకులు ఈ విద్య ప్రదర్శిస్తున్నారు. ఇది నిజం. నన్ను నమ్ము. అట్టి సాధకులను నేను నీకు చూపిస్తానన్నాడు.

మంత్రగాని చీకటి తెర తొలగిపోయింది. బగురప్ప అతనికి చిరుదీపమైనాడు. మంత్రగాడన్నాడు గురువు బ్రతికిన బ్రతుకు ఇతరులను బెదిరిస్తూ సాగించాడు. అతనిది నీచ వృత్తి, పరాన్న జీవితమే. అట్లాగే అతడు తన జీవితం గడిపాడు. నా మార్గం ముళ్లదారనుకున్నాడు మంత్రగాడు. కత్తి పారవేశాడు. గుడ్డి నమ్మకం కళ్ళు తెరుచుకుంది. భౌతిక ప్రపంచం సత్యమైంది. ఊహాలోకం మిథ్య అని గ్రహించాడు.

అన్నా నీ వెంట నేను వస్తాననే మాటలు వినిపించాయి. బగురప్ప కళ్ళు తెరిచాడు. అమావాస్య ఘడియలు దాటిపోయాయి. అక్కడి వస్తు సామాగ్రిని పరశురామ ప్రీతి చేసి, తాను బగురప్ప వెంట బయలుదేరాడు మంత్రగాడు.

చీకటిని తొక్కుతూ నడిచి వచ్చే బగురప్పను తమ్ముళ్లు చూచి నల్ల మేకపోతు ఏదీ అని అడిగితే అతడు మంత్రగాని వైపు చూచాడు. గొఱ్ఱెల చెంత చలిమంట వెలుగుతూంది. ఎవరీ పోతుగాడని, తమ్ముళ్లు నవ్వారు. అప్పుడు ఆ పోతుగాడూ నవ్వాడు. ఆ నవ్వులో అతని గత జీవితం మాయమైంది. తన పేరు తనకొచ్చిందని కాటుక కొండ నవ్విందేమోననుకున్నాడు బగురప్ప.

మరునాడు కాటుక కొండపై గొఱ్ఱెలను మేపుతూ పోతప్ప గట్టిగా మంత్రం చదువుతూ ఒక్కొక్క రాయి నేలకు విసురుతుండగా చూసి బగురప్ప, తమ్ముడా మంత్రాలు నేల రాలుతున్నాయే అని అడిగితే, పోతప్ప అన్నాడు, అన్నా కాటుక కొండ ప్రత్యక్షమై, సాంబ్రాణి రాళ్ళను తీసేస్తే మీ గొఱ్ఱెలకు గడ్డి పెంచుతానన్నదని అన్నాడు.

అప్పుడే ఒక మేక "మేమే" అని అరచింది. బగురప్ప నవ్వుతూ మేకతో, లేదు లేదు, మాట తప్పలేదు. ఇంకా రెండేండ్లకు నీవు చెప్పినట్లు చేస్తానన్నాడు. పోతప్ప తల గీక్కొన్ని అన్నా! నీకు మేక భాష వచ్చా అని అడిగితే, బగురప్ప నీకు కొండ భాష వస్తే నాకు మేక భాష రాదా అంటూనే, తమ్ముళ్ళు నవ్వారు. బగురప్ప నవ్వాడు. పోతప్ప నవ్వాడు.

## చిగురాశ

- జి. సుబ్బారావు
99593 35876

ఎన్ని రకాల రింగ్‌టోన్లయినా
ఒక కోయిల కూతకు సాటిరావు
ఎన్ని ఎస్సెమ్మెస్‌లూ, నెట్‌చాట్‌లూ
ఒక లేఖా సందేశానికి సరితూగవు
ఎన్ని మినరల్ బాటిళ్లయినా
దోసిట పట్టిన చాదబావి నీటికి ప్రత్యామ్నాయం కావు
ఎన్ని పిజ్జాలూ, బర్గర్లూ
చెంచాడు ఉగాది పచ్చడి ముందు దిగదుడుపే



కోయిల వలసపోయినా
కొమ్మ చిగురిస్తూనే ఉంటుంది
తోటలోనే కాదు, మనసులోనూ
కోకిలమ్మ పాట మార్మోగుతూనే ఉంటుంది

సంవత్సరమంతా నిన్ను బతికించే
లోగొంతు కూనిరాగాన్ని పసిగట్టలేవు కానీ
అది వసంత గానమే!

ఎండలు మండిపోతున్నాయనుకుంటాము
కానీ - ఇప్పుడే మల్లెల నవ్వులు
విరబూసేది
సెలవులకొచ్చిన పిల్లల అడుగుల క్రింద
ఎండుటాకులు గలగల నవ్వేది!
శిశిరంలో మోడైన చెట్టు పత్ర

చామరాల్ని పూచేది
సాయంకాలపు మలయ పవనాలు
ప్రియురాలి ఒడిలో సేద తీర్చేది

తొలకరి పులకరింపులకు
ఎండాకాలమే కదా రిహార్సల్స్
వేసేది!

నాలో ఎప్పుడూ ఒక ఆశ
మొగ్గ తొడుగుతూనే ఉంటుంది
విత్తనమై భూమిలో జొరబడి
మొక్కై ఆకాశం లోకి లేవాలని!

## భారమైన నాగలి

- ఏ.వి.ఆర్ మూర్తి
96524 88342

బండికెత్తిన పంట
కంటతడి పెట్టిస్తుందనుకోలేదు
కంఠశోషే మిగులుస్తుందనుకోలేదు
ఎక్కడినుండో
ఒక ఆజ్ఞ జారీ అవుతుంది
మరెక్కడికో
పంటంతా జారుకుంటుంది
చేతికొచ్చిన పంట
నోటిదగ్గరకు వెళ్ళేసరికి
పురుగుమందు అవుతుందనుకోలేదు
పంటమోసం చేస్తుందనుకోలేదు
పంట ప్రాణాలు తీస్తుందనుకోలేదు
పట్నానికి పల్లెదీపం
ఇప్పుడు పల్లె వెలుగులేక



బిక్కు - బిక్కుమనే
వికృత చీకటి రూపం
నాగలి చేత పట్టవలసినవాడు
ఆకలి చేత పట్టి
ఊరూరా తిరుగుతున్నాడు
పల్లె పల్లెకూ పల్లీలు కొడుతున్నాడు
ఇప్పుడు
రైతు జీవితం
ఎద్దులేని కాడి
మోయలేని నాగలి

## అర్థాంగి ???

నూనెల.శ్రీనివాసరావు
9492970231

మూడు ముళ్ళేసాను
ఆమె నాదయింది,
ఏడడుగులు నడిచాను
ఆమె నావెంట నడిచింది,

ఆపై ఆమె
నా మాటై,
నా పాటై,
నా బాటై,
నా బ్రతుకై

చివరకు తనకంటూ
ఏమీలేని నా లోకమై
అలా మిగిలింది.





# తెలుగు సాహిత్యం - మైనారిటీ స్త్రీ వాద దృక్పథం

- డా॥ డి.కె. ప్రభాకర్
077954 44919

సంప్రదాయం పేరుతో మైనారిటీ స్త్రీలపై జరిగే అణచివేతను నిరసిస్తూ ముస్లిం మత స్త్రీవాదులు కలం పట్టారు. ఇలాంటి ధోరణి తెలుగు, కన్నడ సాహిత్యాలతో పాటు ఇతర భాషా సాహిత్యాల్లో కూడా కన్పిస్తుంది. ఈ మైనారిటీ స్త్రీవాద సాహిత్యంలో అనేక స్త్రీల సమస్యలు మనకు గోచరిస్తాయి.

చలనశీల సమాజం ఎప్పుడూ మార్పుకు లోనవుతూ వుంటుంది. సాంఘిక, రాజకీయ, మతోద్యమాలు ఆవిర్భవించటం మనకు తెలిసిన విషయమే. వీరశైవ, సమన్వయోద్యమం, జానపదోద్యమం మొదలైనవి ప్రాచీన కవిత్వంలో కన్పిస్తాయి. అయితే వీటికంటే తీవ్రమైనవి. వ్యాప్తి కలవి ఆధునిక కవిత్వంలోని ఉద్యమాలని పేర్కొనవచ్చు. సాహిత్య ప్రక్రియల్ని అధిగమించే శక్తి కవిత్వానికి సహజంగానే వుంటుంది. కాబట్టి కవిత్వంలోనే ఉద్యమాల ప్రసక్తి కనబడుతోంది. దాదాపు నూరు సంవత్సరాల్లో సాంఘికంగా, రాజకీయంగా, కవిత్వపరంగా ఆంధ్రదేశంలో అనేక ఉద్యమాలు తలెత్తాయి. వీటిలో కొన్ని స్వదేశీ ఉద్యమాలు కాగా, మరికొన్ని విదేశీ ఉద్యమాల ప్రభావం వల్ల ఉద్భవించినట్టివి. అలాంటి వాటిలో జాతీయోద్యమం, భావకవిత్వోద్యమం, అభ్యుదయ, దిగంబర, విప్లవ ఉద్యమాలు ముఖ్యమైనవి. వీటితోపాటు సమకాలీన కవిత్వ పోకడల్లో చెప్పుకోదగ్గవి: స్త్రీవాద, దళితవాదం, మైనారిటీ వాదాలు.

19వ శతాబ్దంలో ప్రారంభమైన సంఘ సంస్కరణోద్యమాలన్నింటిలో "స్త్రీల" విముక్తి అత్యంత ప్రధానాంశం అయ్యింది. దీనికి కారణం ఆనాటి భారతదేశంలోని స్త్రీల దుస్థితే. 19వ శతాబ్దం నాటికి భారత సామాజిక వ్యవస్థ పురుషాధిక్యత, పితృస్వామ్య వ్యవస్థని కలిగి వుంది. సంఖ్యాపరంగా స్త్రీలు సమాజంలో సగ భాగమైనప్పటికీ, తరతరాలుగా భారత స్త్రీ సామాజికంగా ఆర్థికంగా, రాజకీయంగా అణచివేయబడి; అన్ని విషయాల్లోనూ, అన్ని స్థాయిల్లోనూ పురుషుల కింద అణిగిమణిగి ఉండేవారు. బాల్యంలో తండ్రి ప్రాపకం కింద, యుక్త వయస్సులో భర్త ఆదుపాజ్ఞలలో, వృద్ధాప్యంలో కొడుకుల పోషణలో ఉండవలసి వచ్చేది. దురదృష్టవశాత్తు భర్త మరణిస్తే మిగిలిన జీవితాన్ని అమానుషమైన, అవమానకరమైన, బాధాకరమైన వైధవ్యంతో గడపవలసి వచ్చేది.

స్త్రీ, ఒక్క భార్యగా ఉండటం తప్ప పుట్టుకతో వచ్చిన తన సృజనాత్మక శక్తిని, సామర్థ్యాల్ని, కోరికల్ని గానీ వ్యక్తీకరించే అవకాశమే లేదు. వీటితో పాటు బాల్య వివాహాలు, సతీసహగమనం, పరదా పద్ధతి వంటి అనేక సాంఘిక దురాచారాలు, వ్యవహారాలు స్త్రీని సాంఘిక వికలాంగురాలిగా చేశాయి. నాటి సమాజంలో ముస్లిం స్త్రీలు కూడా ఈ సమస్యలకు మినహాయింపేమీ కాదు. విస్తృత వ్యాప్తిలో వున్న దేవదాసీ, వేశ్యా వ్యవస్థల ద్వారా కొందరు స్త్రీలను ప్రజా ఆస్తిగా భావించేవారు. వారసత్వపు హక్కులు కానీ, ఆస్తి హక్కులు గానీ ఉండేవి కావు. ముస్లిం స్త్రీలకు ఆస్తి హక్కున్నా పురుషుడికి ఇచ్చే వాటిలో సగ భాగమే ఇవ్వబడేది. స్త్రీలకు విడాకుల ప్రసక్తే ఉండేది కాదు. ముస్లిం స్త్రీలకు విడాకుల అవకాశం ఉన్నా అది పురుషులకు మాత్రమే అనుకూలించి స్త్రీలకు ఆ హక్కు ఒక శాపంగా పరిణమించింది.

19వ శతాబ్దంలో కొనసాగుతున్న ఇటువంటి సామాజిక కట్టుబాట్ల చట్రం నుండి భారత మహిళను విముక్తి చేసేందుకు పాశ్చాత్య విద్యావంతులైన కొందరు భారతీయ మేధావులు నడుం బిగించారు. స్త్రీ అణచబడి ఉన్నంతకాలం, మూఢ నమ్మకాలలో మునిగి ఉన్నంత కాలం సమాజం, దేశం బలహీనంగా ఉంటుందని భావించారు. సమాజంలో సమస్యలన్నింటికి ప్రధాన బాధితురాలు స్త్రీ కావడంతో తరతరాల పితృస్వామిక దాస్య శృంఖలాల నుండి స్త్రీని విముక్తి చేసేందుకు అనేక చర్యలు చేపట్టారు. ఇలాంటి పరిస్థితులు, పాశ్చాత్య విద్యా ప్రభావం వంటివి స్త్రీవాదానికి దారితీసాయని చెప్పవచ్చు.

భారతదేశంలో జనగణన ప్రకారం హిందువుల తర్వాత సంఖ్యాపరంగా ముస్లింలు, క్రైస్తవులు, సిక్కులు, జైనులు, బౌద్ధులు మొదలైనవారు తర్వాతి స్థానాల్లో ఉన్నారు. దేశంలో హిందువులు తప్ప తక్కిన వారంతా దాదాపుగా అందరూ అల్ప సంఖ్యాకులే. కానీ అల్ప సంఖ్యాకులైన ముస్లింలు 1947లో అఖండ భారతదేశం రెండుగా విడిపోయినప్పటి నుండి దేశంలో మతపరంగా అణచివేతకు గురౌతూ ఎన్నో సమస్యల్ని, అవమానాల్ని భరించి చివరకు విసిగివేసారి తీవ్రమైన తిరుగుబాటుల్ని చేస్తూ వస్తున్నారు. ఈ నేపథ్యంలోనే ముస్లింవాద కవిత్వం, సాహిత్యం లేదా ఉద్యమం పుట్టుకొచ్చింది.

> ముస్లిం కవయిత్రి షాజహానా ముస్లిం స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యల్ని, బాధల్ని, అవమానాల్ని దోపిడీల్ని గురించి ప్రస్తావిస్తూ ముస్లిం స్త్రీల జీవితాల్లో స్వేచ్ఛ, స్వాతంత్ర్యం వంటి వాటిని, వరదాల మాటున నలిగిపోతున్న పసిడి మొగ్గల దయనీయ గాథలెన్నింటినో "పర్ద హటాకే దేఖో (ముసుగు తీసి చూడు) అనే శీర్శికన తన ఆవేదన తెలియజేసింది.

ప్రపంచవ్యాప్తంగా పరిస్థితుల్ని బట్టి తమ సమస్యలలో ప్రత్యేకత ఉందని, అల్ప సంఖ్యాక వర్గం కావడం వల్ల అభద్రతాభావం నెలకొందని భావిస్తున్న ముస్లింలు మనోభావాలను ప్రతిఫలిస్తూ రచిస్తున్న సాహిత్యమే మైనారిటీవాద సాహిత్యం, మైనారిటీవాద కవుల్లో ముఖ్యమైన వారు ఇస్మైల్, హనీఫ్, యాకూబ్, మహబూబ్, స్కైబాబ, దిలావర్, ఖాజా, ఖాదర్, ఇక్బాల్‌చంద్, మొహియుద్దీన్, షాజహానా, హరీఫ్, అఫ్సర్, గౌస్, మెహజబీన్, సలీం వంటి రచయితలు, కవులు, కవయిత్రులు. ప్రారంభంలో ముస్లింవాద కవిత్వం దళిత వాద కవిత్వంలో ఒక పాయగా ఉండేది. అయితే బాబ్రీ మసీదు విధ్వంసంతో ముస్లింవాదం ప్రత్యేక ధోరణిగా తలెత్తడం గమనార్హం.

## మైనారిటీ స్త్రీవాదం

ముస్లిం స్త్రీలలో కన్పించే సమస్యలు ఇతర మతాలకు చెందిన స్త్రీలలో కన్పించే సమస్యలకు భిన్నంగా ఉంటాయి. తమ మతంలోనే తమను పరాయివాళ్లుగా చూడటం, బురఖా నిబంధనలు, స్వేచ్ఛ లేకపోవడం లాంటి అణచివేతలకు వ్యతిరేకంగా ముస్లిం స్త్రీ వాదులు పెదవి విప్పారు. మైనారిటీ ఆచార సంప్రదాయాల్లో స్త్రీలకు వ్యక్తిత్వం లేకపోవడం, స్త్రీల వయస్సుతో పాటు నిబంధనలు పెరగటం వల్ల స్త్రీల అభివృద్ధికి ప్రతిబంధకాలవుతున్నాయి. మైనారిటీ స్త్రీల జీవితాలు ఘోషాల వెనకాల, బురఖాల ముసుగులో కూరుకుపోయి మానసిక క్షోభకు గురౌతున్నాయి.

సంప్రదాయం పేరుతో మైనారిటీ స్త్రీలపై జరిగే అణచివేతను నిరసిస్తూ ముస్లిం మత స్త్రీవాదులు కలం పట్టారు. ఇలాంటి ధోరణి తెలుగు, కన్నడ సాహిత్యాలతో పాటు ఇతర భాషా సాహిత్యాల్లో కూడా కన్పిస్తుంది. ఈ మైనారిటీ స్త్రీవాద సాహిత్యంలో అనేక స్త్రీల సమస్యలు మనకు గోచరిస్తాయి.

ముస్లింవాద కవులు, కవయిత్రులు బురఖా/పరదా పద్ధతి మీద పెద్ద యుద్ధమే ప్రకటించారు. ముస్లిం కవయిత్రి షాజహానా ముస్లిం స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యల్ని, బాధల్ని, అవమానాల్ని దోపిడీల్ని గురించి ప్రస్తావిస్తూ ముస్లిం స్త్రీల జీవితాల్లో స్వేచ్ఛ, స్వాతంత్ర్యం వంటి వాటిని వరదాల మాటున నలిగిపోతున్న పసిడి మొగ్గల దయనీయ గాథలెన్నింటినో "పర్ద హటాకే దేఖో (ముసుగు తీసి చూడు) అనే శీర్శికన తన ఆవేదన తెలియజేసింది.

"ఊహ తెలియని వయస్సులో
గుమ్మానికి పరదా కడితే
రంగు రంగుల కుచ్చులు చూసి మురిసిపోయేదాన్ని !
అప్పుడే స్వేచ్ఛకి మొదటి బేడీ అని
తెలుసుకోలేని పసిదాన్ని...
గుమ్మానికి కట్టినట్టే అమ్మ ముఖానికి బురఖా కడితే
స్వప్నంలాంటి జిందగీకి శావమని అప్పట్లో తెలియనిదాన్ని.

ఇలా ఊహ తెలియని వయస్సు నుంచి జీవిత చరమాంకం వరకు పరదాల మాటున స్త్రీ నలిగిపోవడాన్ని నిరసిస్తూ మీరు బిగించిన ఇనుప సంకెళ్లని విదిల్చి వేయగల గుండె ధైర్యం నాకు చాలా వుంది అంటూ ధైర్యంగా తన తిరుగుబాటును ప్రకటించిన కవయిత్రి షాజహానా. ఈమె రాకతో ముస్లిం స్త్రీల జీవితం గాఢంగా అక్షరబద్ధమయ్యింది.

ఇవాళ ముస్లిం స్త్రీవాద కవిత్వానికి షాజాహానా మారుపేరుగా మారిపోయింది.

ముస్లిం స్త్రీలకు ఉండే ఘోషాని, బురఖాని "స్కైబాబా" ముస్లింవాద కవి తన కవిత "హిజాబ్"లో తరతరాల నుండి వస్తున్న సాంప్రదాయాల్ని వ్యతిరేకిస్తూ ముస్లిం స్త్రీల ఇబ్బందుల్ని ఈ క్రింది విధంగా ప్రశ్నించారు.

"తరతరాల నా అంతరాంతరాల/ఘోషనెవరూ వినకుండా/తెలివిగా కట్టిన తెర ఈ "గోషా"/సూర్యుడి చూపులక్కూడా/నన్నో అస్పృశ్యను చేసి బుర్ఖాలో దాచేస్తే/నాగుల్ఫోషీ తొడిగిన పువ్వులకీ/నా కలల చాందినీకీ/ఏ పవిత్ర గ్రంథం ప్రాణం పోస్తుంది"

తరతరాల తమ వ్యథను వినకుండా తెలివిగా ఈ ముసుగును మా ముఖాలకు కట్టి, నన్నో అస్పృశ్యున్ని చేసి వికసించిన పువ్వుల మా నవ్వులకీ, చందమామలాంటి కలలకీ ఏ పవిత్ర గ్రంథం ప్రాణం పోస్తుందో అని ఎదురుచూస్తూ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల్ని ఆకాంక్షించే ముస్లిం స్త్రీల మనోభావాల్ని వ్యక్తీకరించారు స్కైబాబా.

"ఖాజా" ముస్లింవాద కవి తన ముస్లింవాద కవితా సంకలనంలో "షరతు" అనే ఖండికలో ముస్లిం స్త్రీల గోషాల్ని, బురఖా జీవితాల్ని తీవ్రంగా నిరసిస్తూ-

"మమ్మల్ని చూస్తే/పల్చటి వెన్నెల పొరలోంచి మల్లె పువ్వులా విరబూసిన/పుష్పాలంకృత ఫరిష్టాను చూసినట్లుండాల్సింది/ఆకాశపు వెన్నెల కుండలో చెయ్యిపెట్టి చందమామను/అరచేతిలోకి తీసుకున్నట్లుండాల్సింది/ఒక మరపురాని అనుభూతి కొలనులో/వైమరచి మునకేసినట్లుండాల్సింది/కానీ!/ కరిగిపోతున్న తారు డబ్బాలో ముంచి/తీసిన పావురాన్ని చూసినట్లుంది/సింగరేణి లోయల్లోకి జారిపోయి/రెండు కళ్లూ చికిలించికొన్నట్లుంది/అమావాస్యను కప్పుకొచ్చిన చావుని/అమాంతం వాటేసుకున్నట్లుంది"

అంటూ తమ ముఖాలకు బురఖా లేకపోయినట్లయితే పల్చటి వెన్నల పొరల్లోంచి కనబడే దేవదూతలా, చందమామలా ఎంత అందంగా ఉండేవాళ్లమో అని, తెల్లని పావురాన్ని తారుడబ్బాలో ముంచి తీస్తే ఎంత నల్లగా వుంటుంది, సింగరేణి బొగ్గు గనుల్లో కళ్లు తెరిచినప్పుడు ఏ విధంగా ఉంటుందో అలాగే మా ముఖాలకి ఆ బురఖా వల్ల అంత నల్లధనం వచ్చినట్లుందని ఆవేదన తెలియజేశాడు. ఇలా అనేక మంది ముస్లింవాద కవులు ఈ బురఖా వ్యవస్థపై తమ రచనల ద్వారా నిరసనను తెలియజేశారు.

ప్రపంచంలో అధికారికంగా ఏ మతస్థులకు లేని ఒక అవకాశం ముస్లిం మతస్థులకుంది. అదే బహుభార్యత్వం. తమ పవిత్ర గ్రంథ ప్రకారం కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లోనే ఎక్కువ మంది భార్యలను కలిగి వుండవచ్చుననే నియమం ఉంది. కానీ దీన్ని అలుసుగా చేసుకుని మత పెద్దల అండ దండలతో స్త్రీల మనోభిప్రాయాలకు విలువనివ్వకుండా అవసరం ఉన్నా లేకపోయినా ఎక్కువ మంది స్త్రీలను పెళ్లాడటం ముస్లింలలో కన్పిస్తుంది. ఇలాంటి వివాహ వ్యవస్థ గురించి, ఆ వివాహాల వెనుక ఉండే దయనీయ గాథల గురించి కొంతమంది ముస్లింవాద కవులు, కవయిత్రులు తమ కలాల్ని ఝులిపించి తమ గ్రంథాలలో నిరసనల్ని ప్రకటించారు. సలీం 'వెండిమేఘం' నవలలో ముస్లింలలోని వివాహ వ్యవస్థ, బహుభార్యత్వం గురించి అద్భుతంగా వివరించారు.

దుబాయి షేక్‌లకు వయస్సుతో నిమిత్తం లేకుండా పేద ముస్లింలు తమ బాలికలకి నిఖా చేయటం, పర్యవసానంగా అవాంఛనీయ సంఘటనలు జరగడం షేక్‌ల దేహవాంఛలు తీర్చే యంత్రాలుగా ముస్లిం స్త్రీలను మారుస్తున్న వ్యవస్థను కొంతమంది తమ గ్రంథాల్లో ప్రస్ఫుటంగా చిత్రీకరించారు.

షాజహానా కవయిత్రి ముస్లిం బాలికల్ని షేక్‌లకు అమ్మివేసే వ్యవస్థకు నిరసనగా ఈ క్రింది విధంగా చెప్పారు.

నా అందం వెనుకున్న రక్తమాంసాల్ని
అరబ్బు షేకు డేక్కళ్లతో పీల్చేస్తోంటే
నా శరీరం ముద్దకు వాడు వెల కడుతుంటే
కటికోడు కిలోలకొద్దీ మాంసం అమ్మినట్లు
కిరాతకంగా నన్ను వ్యభిచార బానిసగా అమ్మేస్తోంటే
స్వేచ్ఛ... కనీసం వినటానికి కూడా నిషేదించబడిన దాన్ని!
కలలో అనుభూతించటానికి కూడా అర్హత లేని దాన్ని !

అంటూ తాను తప్ప తక్కిన స్త్రీలంతా బాగా ఎదుగుతూ ఉంటే, నేను మాత్రం స్వేచ్ఛగా కలలో కూడా కలలు కనడానికి అర్హత లేని దానిగా నిషేదించారని ఆవేదనను వ్యక్తపరిచారు. కటికీలో కిలోల కొద్దీ మాంసాన్ని అమ్మినట్లుగా నన్ను కిలోల ప్రకారం అరబ్బు షేకులకు పేద ముస్లిం బాలికల్ని అమ్మివేయటాన్ని, షేకులు తమ కామవాంఛలను తీర్చుకొన్న తర్వాత వ్యభిచారినులుగా మార్చటాన్ని గూర్చి తెల్పారు.

షాజహానా బహు భార్యత్వాన్ని దుయ్యబడుతూ "వాడు ముసలాడయినా ముగ్గురు పెళ్లాల్తో ముచ్చట తీర్చుకోవచ్చు"నని ఆక్రోశాన్ని వ్యక్తపరుస్తుంది. ఇలా అనేక మంది ముస్లిం వాద కవులు, కవయిత్రులు వివాహ వ్యవస్థ, బహు భార్యత్వం మీద నిరసన ధోరణిని తెల్పారు.

ముస్లిం మతంలో బహు సంతానోత్పత్తి సర్వసాధారణం. ముస్లిం మతంలోని ఈ బహు సంతానోత్పత్తి వ్యవస్థను నిరసిస్తూ యాకుబ్ తన "బూబమ్మ" అనే కవితలో-

"ఆమె ఇప్పుడు మనిషి కాదు/పునరుత్పత్తి పరికరం/

మతానికి అభిమతానికి మధ్య/నలిగి నలిగి పిల్లల కోడై కూర్చుంది/పొత్తి కడుపు మీద కత్తి గాట్లకు/కత్తెర్లు కూడా బిత్తర పోయాయి"

అని అంటూ బూబమ్మ అనే మహిళ ఇప్పుడు మనిషి కాదు, ఆమె పిల్లల్నికనే యంత్రంగా మారిందనీ; ఆమె పొత్తికడుపు మీదున్న కత్తిగాట్లను చూస్తే ఆ కత్తెర్లే బిత్తర పోతాయనీ బూబమ్మ అనే ముస్లిం స్త్రీ ప్రసవ వేదనను తెలియజేశాడు.

ముస్లిం స్త్రీలు ఎంత మందినైనా సరే పిల్లల్ని కని తీరాల్సిందేనని చెప్పే మత ఛాందసవాదాన్ని గురించి –

"ప్రతి ప్రసవానికీ నా ప్రాణం రెండుగా చీలుతున్న బాధనో

కత్తులూ కత్తెర్ల కొసల మీద ఖండ ఖండాలయ్యే గోసనో

భరించేది నా శరీరమే కదా !

నీకేం... ఎంతమందినైనా కనమంటావ్ !"

అని ప్రశ్నిస్తున్న ముస్లిం స్త్రీల జీవితాల్ని అందులోని బాధల్ని "సాంబా" అనే వచన కవితలో వ్యక్తపరిచారు స్కైబాబా, ఇదే కవితలో ముస్లిం స్త్రీలు ఎదురుతిరిగి ప్రశ్నించటాన్ని కూడా ప్రస్తావించారు.

"నొప్పులు నావైనప్పుడు/నిర్ణయాలు నీవెలా అవుతాయ్

దేహం నాదైనప్పుడు/అధికారం నీదెలా అవుతోంది"

అంటూ పురుషాహంకారాన్ని గూర్చి ప్రశ్నించాడు స్కైబాబా.

అనేక మందికి జన్మనివ్వడానికి పుట్టిన ముస్లిం స్త్రీల సమస్యల్ని "షహనాజ్ ఫాతిమా" అనే ముస్లిం స్త్రీవాద కవయిత్రి కవిత్వీకరించారు. ఆమె ఓపిగ్గా అసంఖ్యాక వారసుల్నిచ్చే సంతానోత్పత్తి కర్మాగారం.. అనాదిగా ఆధారపడ్డం అలవాటు చేయబడిన స్వయం ప్రతిపత్తి లేని పరాధీనగా ముస్లిం స్త్రీ జీవితాన్ని వెళ్లదీస్తున్న దృశ్యాన్ని అభివర్ణించారు షహనాజ్ ఫాతిమా, "ఖబర్దార్" అనే కవితలో ముస్లిం స్త్రీ అనుభవిస్తున్న లైంగిక హింసను షహనాజ్ ఈ క్రింది విధంగా వర్ణించారు.

"మీ సుఖం కోసం ప్రాణం చీల్చుకు

పన్నెండు మందిని కన మనండి

లేకపోతే నరకం ఇప్పుడు అనుభవిస్తున్నదే పక్కా స్వర్గం"

అని చెబుతూనే "మమ్మల్ని మౌన మాంసాలుగా ఉత్పత్తి యంత్రాలుగా బతకమన్న మీ సంప్రదాయానికో సలాం" అని తిరిగుబాటు ధోరణిని ప్రకటించిన కవయిత్రి – షాజహానా.

ముస్లింలలో ఉన్న బహు సంతానోత్పత్తి, లైంగిక హింస గురించి సలీం తన "వెండిమేఘం" నవలలో సవివరంగా వివరించారు. అంతేకాక సురవరం గారి కథలలోనూ, నెల్లూరి కేశవస్వామి కథలలోనూ, సత్యాగ్ని కథలు, సలీం కథలు, వతన్ కథలు ఇలా అనేక మంది తమ గ్రంథాల్లో ముస్లిం స్త్రీల సాధకబాధల్ని పలుకోణాల్లో చిత్రీకరించి మైనారిటీ స్త్రీ వాదానికి దోహదపడ్డారు.

ముస్లిం మతంలో జరిగే బాల్య వివాహాల గురించి, పేదరికం, దారిద్ర్యపు వ్యవస్థలో కూరుకుపోయి డబ్బులకు ఆశపడి తమ బాలికలను షేకులకు అమ్మేయడాన్ని చాలా మంది కవులు, కవయిత్రులు తమ నిరసనలను ఆక్రోశంతో తెలియజేశారు. ఖాజా "పత్వా" అనే వచన కవితా సంపుటిలో ముస్లిం బీదరికం, దారిద్ర్యంతో ముక్కుపచ్చలారని పసిపిల్లల్ని ముసలివాళ్లకిచ్చి పెళ్లి చేయటాన్ని, అరబ్బు షేకులకు అమ్ముకోవడాన్ని ప్రశ్నిస్తూ –

"అల్లాహో అక్బర్

ఇంకా పురిటి వాసనైనా పోని పసిబిడ్డల్ని

అమ్మ పొత్తిళ్లలోంచే అరవై ఏళ్ల ముసలోడు

పెళ్లాడ్డం మాత్రం నేరం కాదు

సాక్షాత్తు తల్లిదండ్రులే

కూతుళ్లను అరబ్బు దేశాలకమ్మడమూ నేరం కాదు" అని ఆవేదన చెందారు.

బాల్యవివాహం గురించి సలీం తన వెండిమేఘం నవలలో అత్యంత అద్భుతంగా వర్ణించారు. ముక్కుపచ్చలారని వయస్సులో రాత్రి పూట నిద్రపోతున్న సమయంలో తన బావతో నిఖా (పెళ్లి) జరిపించి, తదనంతరం ఆ బాలికను తీసుకెళ్లి రైల్వే స్టేషన్‌లో భర్త బాషాకు అప్పగించటం వంటి విషయాలు ప్రతి మనిషినీ ఆందోళనకు, దుఃఖానికి గురి చేస్తాయి. ఇలా అనేక మంది ముస్లింవాద కవులు బాల్యవివాహాలు, అరబ్బు షేకుల దాష్టీకం గురించి తమ ఆక్రోశాన్ని తెల్పారు.

ముస్లిం స్త్రీల స్వేచ్ఛకు, ఎదుగుదలకు అడ్డంకిగా మారిన బురఖా పద్ధతి, బహు భార్యత్వం, బహు సంతానోత్పత్తి, బాల్య వివాహాలు, విడాకులు (తలాక్) శారీరక హింస, పురుషాధిక్యం, కుటుంబ హింస, ఆర్థిక విద్యా కారణాలు, లైంగిక వివక్ష, స్త్రీ పునర్వివాహం మొదలైన నిర్బంధాలపై ముస్లింవాద కవులు, కవయిత్రులు కవిత్వీకరించి మైనారిటీ స్త్రీ వాదానికి దోహదపడ్డారు. ❧

## కష్టజీవి మోస్తున్నదే ఈ లోకం

- భూషి కృష్ణదాసు
27240213

ధనము సంపత్తి
ఉద్యోగం పదవులు
సిరులు సింహాసనాలు
విలాసాలు వైభోగాలు
రాజకీయ మాయాజాలం
ఇవన్నీ మాయ
మట్టి గలిసి పోవలసిందే
ఎప్పటికి నిలిచిపోయేది
అబద్ధం కానిది
కష్టజీవి స్వేదం శ్రమ
అవి ఏ కొలతలకు
కొలమానానికి అందవు
మణుగుల్లో తూకమేసి చెప్పలేం
డ్రమ్ముల్లో కొలిచి చెప్పలేం
కష్టజీవి నెత్తిన పెట్టుకొని
మోస్తున్నదే ఈ లోకం



## 'నానీ'లు

- ఎన్.సి.హెచ్. చక్రవర్తి
93999 58069



విందు అంటే
తిండిమాని మరీ వెళ్లా
వెళ్లాక తెలిసింది
వీనులకేనని

కొలువు నచ్చలేదా?
సెలవు మేలు
నచ్చని ఋతువులో
పూవూ పూయదు

ఆ తేనె
మాటకే అంటింది
చేతకు
ఇంకా అంటినట్టు లేదు

విద్వాంసుడి వాయింపులకు
తట్టుకోలేక
మృదంగం
ఒకటే గోల

ప్రజాస్వామ్యం నెగ్గాలనే
నీ కల
సగం నెరవేరింది
స్వామ్యం గెలిచింది

## నానీలు

- ఆర్. బాలకృష్ణ
94401 43488



యుద్ధం ఇప్పుడు
రక్తం చిందించడం లేదు
మూల్గులను
పీల్చేస్తోంది

రైతు పాదాల నెర్రెల్లోంచి
రక్తం కారుతోంది
పంటచేలకు
ఎరువుగా

విద్యుత్ఛక్తితో
అన్నీ సాధించాం
పేదవాడి కంట్లో
వెలుగును తప్ప

పగలు రాత్రి
యుద్ధంలో
తొలి మలి సంధ్యలే
యుద్ధ క్షేత్రాలు

ఫోర్బ్స్ జాబితాలో
కొత్త బిలియనీర్లు
కోట్ల జనాభా
బీరునీర్లతో

వేల ఏళ్ళ కట్టడం
సజీవంగా ఉందా?
రక్తమాంసాలే
సిమెంటు కదా!

కాలం కత్తి మీద
మనిషి పరుగు
రక్తం
చిందించకుండా

తమకోసం
సంపాదిస్తాయి జీవులు
తరాల కోసం
మనిషి

అంగారకుడిపై
జీవం ఉనికి
దొరికింది
భూమిపై కోల్పోతూ !

ఇంకుడు గుంతల మధ్య
జీవితం
ఒక్క కన్నీటి చుక్కైనా
వృథా పోదు !




# తెలుగు సినిమా దర్శించిన స్త్రీ సమస్యలు

డా॥ పరుచూరి గోపాలకృష్ణ
డా॥ సింగుపురం నారాయణ

**1931**లో ప్రారంభమైన తెలుగు సినిమా ప్రయాణం నేటికీ అప్రతిహతంగా సాగుతూనే ఉంది. ముందు పౌరాణిక కథలపై ఆధారపడిన తెలుగు సినిమా నిర్మాతలు, దర్శకులు, రచయితలు, సామాజికపరమైన సాంఘిక కథాంశాలను దృష్టిలో పెట్టుకుని రచనలు చేసారు.

రైతుల గురించి, కులం పట్టింపుల గురించి, అంటరానితనం గురించి, స్వరాజ్య పోరాటం గురించి, లంచగొండితనం గురించి ఒకటేవిటి, సమాజంలో సామాన్య మానవుడు ఎదుర్కొంటున్న అవినీతి, ఆశ్రిత పక్షపాతం, అధికార పైశాచికత్వం, రాజకీయ రాక్షసత్వం అన్నీ తెలుగు సినిమాకు మూల కథలై, ఆ కథాంశాలు, ఆ పాత్రలు, ఆ సంభాషణలు, ఆయా సన్నివేశాలు సమాజానికి ఉపయోగపడ్డాయి, పడుతున్నాయి.

ముఖ్యంగా స్త్రీల ప్రత్యేక సమస్యలు కూడా సినిమా కథలలో చర్చించడం జరిగింది. బాల్య వివాహం, వితంతు వివాహం, స్త్రీ వ్యామోహం, లైంగిక వేధింపులు, స్త్రీ వ్యక్తిత్వం, స్త్రీ వికాసం. స్త్రీ పోరాటం, స్త్రీ విద్య వంటి అనేక అంశాలు తెలుగు చలనచిత్ర రచయితలు స్పృశించిన అంశాలే.

చిన్న పిల్లలుగా ఉన్నప్పుడే ఈ దేశంలో ఆడపిల్లలకు పెళ్లి చేసెయ్యడం ఆచారం. ఎనిమిదేళ్ళు వస్తే కన్య అన్న పెద్దల మాటను చద్ది మూటలా స్వీకరించి దాన్ని ఆచరణలో పెట్టేసారు. అయితే ఇక్కడ బాలికకు బాలుడికి వివాహం చెయ్యటం కాదు. ఆరేళ్ళ బాలికకు అరవై నిండిన తాతకు పెళ్ళి చెయ్యడం ఏం ధర్మం? కన్యాశుల్కంలో, లుబ్ధావధాన్లు అగ్నిహోత్రావధాన్లు కూతుర్ని పెళ్లి చేసుకోటానికి సిద్ధపడతాడు. తన కూతురికి ఆరుసంవత్సరాల వయసయినా, తొమ్మిదేళ్ళు అని చెప్పి సంవత్సరానికి రెండు వందల చొప్పున, పద్దెనిమిది వందలు కన్యాశుల్కం అడుగుతాడు.

**క్రీతాం ద్రవ్యేణ యా నారీ, నసా పత్నీ విధీయతే**
**నసా దైవేన సా పిత్ర్యే, దాసీంతాం కశ్యపో బ్రవీత్**

అని పరాశరస్మృతి చెబుతోంది. ద్రవ్యమిచ్చి కొంటే ఆమె భార్య అనబడదు. మానవ కర్మలందు ఆమెకు యోగ్యత లేదు. కశ్యప మహర్షి అలాంటి స్త్రీని దాసి అన్నాడు అని చెబుతున్నారు గదా. ఎనిమిదేళ్ళు నిండితే కన్య కాబట్టి పెళ్ళి చేస్తున్నాం అన్నారు. మరి డబ్బు తీసుకుని దాసిగా పంపుతారా?

లుబ్ధావధాన్లు కూతురు వితంతువుగా బ్రతుకుతూ ఉంటుంది. అగ్నిహోత్రావధాన్లు పెద్ద కూతురు బుచ్చెమ్మ కూడా విధవరాలే. ఇద్దరి ఇళ్ళలోనూ విధవరాళ్ళు కనిపిస్తుంటే మరొక బాలిక గొంతు కొయ్యడం భావ్యమా?

ఈ సమస్యను మధురవాణి, తన తెలివితేటలతో తప్పించి, అగ్నిహోత్రావధాన్లు బావమరిది కరటకశాస్త్రి శిష్యుడితో ఆడవేశం కట్టించి, ఆడపిల్ల కాని ఆడపిల్లతో లుబ్ధావధాన్లను పెళ్ళి జరిపిస్తుంది. నాటకం

బయటపడగూడదు కాబట్టి ఆ దొంగ పెళ్ళి కూతుర్ని తప్పించి, లుబ్ధావధాన్లును కేసులో ఇరికించి, మూడు చెరువుల నీళ్ళు తాగించి, పతాక సన్నివేశంలో ఆయన పెళ్ళి చేసుకున్నది ఆడపిల్లను కాదు. అబ్బాయిని అని బయటపెట్టి, ఆహ్లాదంగా ఆ సమస్యకు ముగింపు చెబుతుంది.

1929లో బాల్య వివాహాల రద్దుకు అప్పటి బ్రిటీష్ పాలిత భారతదేశంలో 'యాక్ట్' తెచ్చినప్పటికి, అది ఒక 'డెడ్ లెటర్'గానే మిగిలిపోయింది. కొన్ని లక్షల వివాహాలు జరిగాయి.

సినిమా మాధ్యమానికి ఎంతో విలువ ఉంది. గురజాడ నాటకం ప్రసిద్ధమైనా, అప్పటికి పేరెన్నికగన్న నటీనటులతో 'కన్యాశుల్కం' చిత్రం నిర్మించి, వేలమంది చూసే నాటకాన్ని లక్షల, కోట్ల మంది చూసే చలనచిత్రంగా మలచి, ఒక వేశ్యపాత్ర ద్వారా, మరొక బాల వితంతువు తయారు కాకుండా, మరొక వని జీవితం మసిబారకుండా, బాల్యవివాహం మంచిది కాదనే సందేశాన్ని అందివ్వడం జరిగింది.




మగవాడికి భార్య చనిపోతే ఎంతమంది నయినా పెళ్ళి చేసుకోవచ్చు కాని, స్త్రీకి భర్త చనిపోతే ఇక మూల ఉన్న గది ప్రపంచం అయిపోతుంది. పుట్టుకతో వచ్చిన పసుపు కుంకాలకు దూరమైపోతుంది. ఒక సమయంలో అయితే శిరోమండనం చేయించి, బాహ్య ప్రపంచానికి దూరంగా పెట్టేవారు. ఎందరో సంఘ సంస్కర్తలు విధవా వివాహాల కోసం ప్రయత్నం చెయ్యడం ప్రపంచానికి తెలిసిందే. అందులో ముఖ్యుడు కందుకూరి వీరేశలింగం పంతులు.

ఈ అంశంపై తెలుగు సినిమా కథకులు స్పందించారు. 1939లోనే వై.వి.రావు తన రచన, దర్శకత్వం, నటన, నిర్వహణలో 'మళ్ళీపెళ్ళి' అని చిత్రం నిర్మించి, అందులో విధవరాళ్ళను మోసం చేసే దొంగ బాబాల గురించి వివరించాడు. అంతేకాదు స్వయంగా కథానాయకుడి పాత్ర విధవరాలిని పెళ్ళి చేసుకోవడంతోనే చిత్రం పూర్తవుతుంది.

1940లో వచ్చిన 'సుమంగళి' చిత్రంలో కూడా వితంతు వివాహం జరిపించడం జరిగింది. చనిపోతున్న భార్య ముచ్చట తీర్చడం కోసం, చిన్న వయసులోనే సరస్వతికి పెళ్ళి చేయిస్తాడు తండ్రి. చిన్నతనంలోనే భర్త చనిపోతాడు. ఆ సంగతి కూడా సరస్వతికి తెలియకుండా పుట్టిన ఊరికి దూరంగా తీసుకుపోతాడు తండ్రి అక్కడ అనాథ శరణాలయం నడిపే పంతులు, తెలియక దీర్ఘసుమంగళీభవ అని ఆశీర్వదిస్తాడు. అతనికి ఆమె బాల్య వితంతువు అనే సంగతి, సరస్వతి తండ్రి చెబుతాడు.

బ్యాంకు దివాళా తియ్యటంతో, ఆయన డబ్బు మొత్తం అందులోనే ఉండటంతో, గుండె జారి మంచం పట్టి మరణిస్తాడు. సరస్వతి మళ్ళీ స్వగ్రామానికి చేరుతుంది. ఊళ్ళోవాళ్ళకు ఆమె చిన్నప్పుడే విధవరాలయ్యిందని తెలుసు కనుక విమర్శిస్తుంటే, తెలుసుకుని, అర్థం చేసుకుని పసుపు కుంకాలకు దూరం అవుతుంది.

సత్యం అనే యువకుడు సరస్వతిని పెళ్ళి చేసుకోవటానికి సిద్ధపడతాడు. ఆమె బాల వితంతువు అని చెప్పిన తర్వాత కూడా సిద్ధమే అంటాడు. అయితే సత్యం మరదలు పార్వతి కూడా బావని చిన్నప్పటినుంచి ఇష్టపడుతూ ఉంటుంది. ఈ విషయం తెలిసి సరస్వతి ఇల్లు వదిలి వెళ్ళిపోతుంది. పంతులుగారు ఆమెను మళ్ళీ గ్రామానికి చేరుస్తాడు. తనకు నచ్చని పెళ్ళి చేస్తున్నారు అన్న ఆవేశంతో పార్వతి ఆత్మహత్యకు ఒడిగడుతుంది. పతాక సన్నివేశంలో సత్యం తండ్రి అంగీకరించడంతో సత్యం, సరస్వతి పెళ్ళి జరుగుతుంది. మరణిస్తూ పార్వతి కూడా సరస్వతి నుదుటన బొట్టు పెడుతుంది.

వైధవ్యం పేరు చెప్పి, ఆడపిల్లలను అణగదొక్కడం మంచిది కాదని, అది మానవ జాతికే తీరని అవమానమని, ఈ అత్యాచారాన్ని సాగనివ్వడం సిగ్గు చేటు, ముక్కుపచ్చలారకముందే వైధవ్యప్రాప్తి కలిగి, ప్రపంచం అంటే ఏమిటో తెలియని బాలికలు, ఈ వైధవ్యం అనే అంశంతో కుళ్ళిపోతున్నారని, మన దేశంలో ఒక్క వితంతువు కూడా లేకుండా చెయ్యటం మన ధర్మం. మన కర్తవ్యం అని ప్రధాన పాత్ర ద్వారా పలికించి, ముగింపులో విధవరాలిని సుమంగళిని చేసి చిత్రం ముగించటం జరిగింది.

స్త్రీ వ్యామోహం ఈ అంశంలో బాధితురాలు స్త్రీయే. బాధించేది స్త్రీయే. మరలా ఆ బాధకు కారకుడయ్యేవాడు పురుషుడయినా ఈ అంశం కథాంశంగా ఒకే రోజు రెండు చిత్రాలు విడుదల అయ్యాయి. 1. లక్ష్మమ్మ కథ, 2. శ్రీ లక్ష్మమ్మ కథ, అంశమే కాదు కథాంశం కూడా ఒకటే. ఇది జరిగిన కథ కాబట్టి ఇరువురు యధాతథంగా తీసుకున్నారు. కథనంలో చిన్నపాటి మార్పులున్నాయి. ఒక దానిలో నారాయణరావు, ఒక దానిలో నాగేశ్వరరావు కథానాయకులు కాగా, ఒక దానిలో కృష్ణవేణి ఒక దానిలో అంజలీదేవి కథానాయికలు.

పెళ్ళిలోనే దేవదాసి నృత్యం చూసి ఆకర్షితుడవుతాడు

వెంకయ్య నాయుడు. శ్రీ లక్ష్మమ్మ కథలో పెళ్ళయిన కొన్నాళ్ళకు వలలో పడతాడు కథానాయకుడు. రెండింటిలోనూ అల్లుడు ఇల్లరికానికి వచ్చి, తన భార్య వెళ్ళి వేశ్యను నిలదీసిందనే కోపంతోనే అత్తారిల్లు వదిలి స్వగ్రామానికి వెళ్ళిపోతారు. ఆ తరువాత శ్రీలక్ష్మి అత్తారింటికి వెళుతుంది. అత్తారింట్లో అత్త, ఆడపడుచుల ఆరళ్ళు ఎదుర్కొని భర్తకు అనుమానం వచ్చేలా వాళ్ళు చెయ్యబట్టే భర్త చేతిలో మరణిస్తాడు. భర్తకు కళ్లు పోతే భార్య దేవత అయ్యి భర్తకు చూపునిస్తుంది.

భార్యను వదిలి వేశ్య వలలో పడడం అనేది 'చింతామణి' నాటకం నుంచి అనేకులకు కథాంశం అయ్యింది.

స్త్రీ వ్యామోహం ప్రమాదకరమని, అది ఆస్తి పోగొట్టుకోవడం, గౌరవం పోగొట్టుకోవడంతో పాటు ప్రాణాలు కూడా తీసేలా చేసి హంతకుణ్ణి చేస్తుందని సందేశం ఇచ్చాయి రెండు చిత్రాలు.




స్త్రీ వ్యామోహం కథాంశంగానే 'స్వర్గసీమ' చిత్రం1945వ సంవత్సరంలో వచ్చింది. నాగయ్య భానుమతి ప్రధాన పాత్రధారులు. విచిత్రమేమిటంటే, భానుమతి చిత్రాంగిలా, కథానాయకుణ్ణి లొంగదీసుకోవడం.

వీధి నాటకాలాడే సుబ్బి, తర్వాత సుజాతగా పేరు మార్చుకుంటుంది. పత్రికలకు రాసే కథానాయకుణ్ణి ఆకర్షిస్తుంది. ముందు అతని ఇంటికొచ్చి ఆయన భార్యతో అమ్మా మీ చెమటకు చిరిగిన చీర ఉంటే ఇమ్మని, ఆమె కట్టి విడిచిన చీరను తీసుకుంది. ఆ తర్వాత ఆమె భర్తనే సంగ్రహించింది. అతని కంటే గొప్పవాడయిన ఇంకో వ్యక్తి లభించగానే, అతన్ని వదిలేసింది. ఇంటికి తిరిగి వచ్చిన కథానాయకుడు భార్య పాదాల మీద పూలు వేసి, క్షమాపణ కోరతాడు. గృహమే కదా స్వర్గసీమ అన్న సందేశంతో చిత్రం పూర్తవుతుంది.

సామాన్యంగా చిత్రంలో ఒక సంఘటనలోనో, ఒక దృశ్యంలోనో లైంగిక వేధింపు సంఘటనలుంటాయి. కాని తెలుగు సినిమా కథా రచయితలు, లైంగిక వేధింపు కథాంశంగా సినిమా కథలే రాసుకున్నారు. అలా నిర్మించబడిన చిత్రం 'దేవత' 1941లో విడుదల అయ్యింది.

వేణుగోపాల్ లండన్‌లో, లా పట్టభద్రుడై ఇంటికి వస్తాడు. వాళ్ళ ఇంట్లో పనిచేసే అమ్మాయి పేరు లక్ష్మి విదేశాలలో చదువుకుని, పాశ్చాత్య వ్యామోహంలో పడి, తిరిగి ఇండియాకి వచ్చిన వేణుగోపాల్, ఇంట్లో నిద్రిస్తున్న లక్ష్మిని చూసి వ్యామోహానికి గురవుతాడు. ముందు నిబ్బరించుకుంటాడు. కాని తట్టుకోలేక ఆమెను అనుభవిస్తాడు. యజమానికి ఎదురు తిరగలేకపోతుంది లక్ష్మి తెల్లారాక నిన్ను నా భార్యను చేసుకుంటాను అంటాడు.

కాని, వృత్తిరీత్యా మద్రాసు వెళ్ళిపోతాడు. అక్కడ మరదలు విమల, తన బావను పెళ్ళి చేసుకోవాలనుకుంటుంది. అప్పుడు వేణు కుటుంబం మద్రాసు వస్తుంది. వాళ్ళతో లక్ష్మి కూడా వస్తుంది. తనకు మాటిచ్చిన వేణుగోపాల్ పెళ్ళి మరదలితో జరిగిపోబోతుంది అని లక్ష్మికి అర్థం అవుతుంది. డబ్బు ఇచ్చి ఆమెను పంపాలని చూస్తే, డబ్బుకి శరీరాన్ని అమ్ముకునే కాముకురాలిని కాదు అంటుంది. నువ్వు, నన్ను చేసుకుంటానన్నావు గాని, నేను నిన్ను చేసుకుంటానన్నానా... నన్ను పెళ్ళి చేసుకోమని వత్తిడి చేసానా అని నిలదీసింది.

ఆ తర్వాత ఆమె కథ మలుపులు తిరిగి చివరకు వేణుగోపాల్, లక్ష్మిని పెళ్ళి చేసుకుంటాడు. యజమానికి ఎదురు తిరగలేని బలహీనత, నోరు మూసుకుని పడి ఉంది కదా అనే ధైర్యం. నిజానికి ఇలాంటి సంఘటన నాగయ్య నిజ జీవితంలో జరిగిందని కొందరంటారు. ఇద్దరు భార్యలు చనిపోయాక 'జయలక్ష్మి' అనే పనిమనిషితో సంబంధం పెట్టుకుని, ఆమెను వెంటనే వివాహం చేసుకుని బి.ఎన్.రెడ్డి గారి ఆశీస్సులు తీసుకున్నారని చెప్పుకుంటారు.

ఏమైనా లైంగిక వేధింపుకు సరైన శిక్ష అప్పుడు లేదు. ఇప్పుడు 'నిర్భయ యాక్ట్' వచ్చాక కూడా ఆ వేధింపులు ఆగకపోవడం విచిత్రం.

స్త్రీ వ్యక్తిత్వాన్ని నిరూపించటానికి అనేక తెలుగు చిత్రాలలో కథానాయికల పాత్రలు సృష్టించారు. ఆయా సినీ రచయితలు అందులో 'సంకల్పం' అనే చిత్రం ఉంది.

గోపయ్య తన కుమార్తె లక్ష్మిని, తన చెల్లి కొడుకు రఘుకు ఇచ్చి పెళ్ళి చేసాడు. రఘు నేర ప్రవృత్తి కలవాడు. అంతేకాదు వేశ్యాలోలత్వం కూడా ఉంది. జైలునుంచి వచ్చి రాత్రి భార్యతో కాపురం చేసి మళ్ళీ నగలు ఎత్తుకుని పారిపోతాడు. మళ్ళీ ఆరు సంవత్సరాలు జైలు శిక్షకు గురవుతాడు. విడుదలయ్యాక, కొడుకు ఆట వస్తువునే దొంగతనం చేస్తాడు. కానీ సహనంతో ఆ భార్య అతన్ని సహిస్తుంది. అతనిలో మార్పు తెస్తుంది.

పెళ్ళినాడే పోలీసులు పట్టుకుపోయిన వాడు. వీడు మొగుడు ఏమిటి అనుకోలేదు. ఓర్పు వహించింది. అదే ఆమె వ్యక్తిత్వం అయ్యింది.

'అర్థాంగి' చిత్రంలో కూడా కథానాయిక పద్మావతి పెళ్ళి పీటల మీద తన భర్త 'రాఘవేంద్ర' మతి స్థిమితం లేనివాడు అని తెలుసుకుంటుంది. అతనితో జీవితం ఏమిటి అని చింతించదు. కాపురానికి వచ్చాక, భర్తకు నల్లమందు పెడుతున్నారని తెలుసుకుంటుంది. భర్తను దండించబోయిన

# చీకట్లను చీల్చుకుంటూ

- పురుషోత్తం సతీష్
8897430904



మేడి పండు లాంటి మగత్వం మాటలకు
పైపై ప్రేమను ఒలకబోసే మేకవన్నె పురుషులకు
అమ్మో.. నీ అందాలు రసరమ్య సౌందర్యాలంటూ
మనస్సుని మచ్చిక చేసుకుని విసురుతారు నింగిలోకి
పాపం నమ్మి వెలుతుంది ప్రేమ అనే పద్మవ్యూహంలోకి
ఇస్తుంది ప్రేమకు నిదర్శనం శీల, శరీర, సుగుణం
అనంతరం అర్థమయ్యే
మకరందం కోసం, కందిరీగ వచ్చేనని
అలా దోయబడిన శీలాలకు ఏం వెచ్చిస్తుందీ సమాజం
క్లబ్బుల్లోన పబ్బుల్లోన అతివ అందాన్ని అర్థనగ్నంగా
శృంగారం చేసేదెవరు?
మగ మహారాజులం మేమేనంటూ అందాలను
విందుచేసేదెవరు?
పైశాచిక ప్రేరణ ఉప్పొంగించి ప్రదర్శించేది ఎవరిపైన?
సభ్య సమాజం తలదించే ప్రతిరోజొక ఘటన సంఘటన
ఉదయాన్నే మొదలయ్యే పత్రికల ప్రకంపనలు
ప్రతి మహిళా కనుగుడ్డలో కదలాడే కన్నీటి ధారలు
ప్రతి మహిళ ఇంటిలోన ఏదో విషాద బాధ
కట్నపు జ్వాలల్లో కమిలిపోయిందొక పేదరికం
సాముహిక హత్యాచారంతో చనిపోయిందొక స్త్రీత్వం
ప్రేమ ముసుగులో మోసపోయిందొక ప్రియురాలి ప్రేమత్వం
ఇదేంటని అడిగితే మృత్యువు ఒడిలోకి తోసేసిందీ లోకం
దీనంతటికీ కారణం ఈ పురుషాధిక్య సమాజం కాదా?
కామాందుల దాడుల్లో సమిధలవుతున్న చిన్నారులకి
ఆడతనమే శాపం
ప్రతి మహిళ మృగత్వంపై ఆదిలోనే ఆదిశక్తి కావాలి
ఆర్థిక సమానత్వం స్వేచ్ఛా స్వాతంత్ర్యానికై
కమ్మేసిన కారుమబ్బులు చిమ్మని చీకట్లను చీల్చుకుంటూ
మహిళా ధన మాన ప్రాణాలను హరించే
దోపిడీదారుల గుండెల్లో గుణపాలు దించేందుకు
కావాలి ఒక చైతన్యం రావాలి ఒక మరో విప్లవ చైతన్యం
అదే అదే మహిళా చైతన్యం, స్త్రీ విముక్తికై పోరాటం
ఉండాలి అడుగడుగున ఆరాటం చేయాలి వివక్షతను అంతం

---

మరిదిని తానే దండిస్తుంది. భర్తకు చదువు చెబుతుంది. అతన్ని జ్ఞానవంతుణ్ని చేస్తుంది. నిల్లమందుకి దూరం చేసి యోగ్యుణ్ణి చేస్తుంది.

స్త్రీకి పోరాడే శక్తి ఉందని ఉషాకిరణ్ మూవీస్ వారి 'ప్రతిఘటన' చిత్రం నిరూపించింది. నగరాల్లో పెరిగిపోయిన రౌడీయిజాన్ని మగవాళ్ళు ఎదుర్కొనలేకపోతే ఒక మహిళ ఎలా ఎదుర్కుందో చూపించిన చిత్రం 'ప్రతిఘటన'.

ఆ పని చెయ్యడం కోసం ఆమె అత్తింటివాళ్ళ దగ్గర అవమానపడింది. నడిరోడ్డు మీద వస్త్రాలు విప్పినా భయపడలేదు. భర్తకు దూరమయ్యింది గాని ఆశయానికి దూరం కాలేదు. తన విద్యార్థులు, తన బొమ్మను నగ్నంగా బ్లాక్‌బోర్డు మీద చిత్రించి అవమానపరిస్తే ఈ దుర్యోధన దుశాస్సన దుర్నీతి లోకంలో' అంటూ గీతంగా వాళ్ళలో చైతన్యం తెచ్చింది. అది మర్మస్థానం కాదు లోకుల జన్మస్థానమని తెలియజేసింది. ఎలక్షన్లలో, రౌడీపక్కకు వెళ్ళినట్లు నటించి, నడిరోడ్డు మీద తనకు వస్త్రాపహరణం చేస్తే, నిండు సభలో అతన్ని గొడ్డలితో నరికి చంపింది.

స్త్రీ ప్రతిఘటిస్తే మహాకాళీ అని నిరూపించిన ఈ చిత్రం నాటికీ నేటికీ పదుగురి నోట నానుతూనే ఉంటుంది.

ఆడపిల్ల, డబ్బా కిరసనాయిలు, అగ్గిపుల్లతో అంతం అయిపోగూడనే 'మౌనపోరాటం' గాని, 'కర్తవ్యం' కోసం ప్రాణాలైనా ఇవ్వటానికి సిద్ధమన్న 'కర్తవ్యం' చిత్రంగాని, సారా ఉద్యమానికి ఆదర్శమైన స్త్రీ పాత్ర ప్రధానమైన 'ఆడది' చిత్రంగాని. స్త్రీ చాకిరీ నుంచి మరణించిన రోజుకే విముక్తి కలుగుతుంది అని చెప్పిన 'అమ్మ రాజీనామా' కాని స్త్రీ సమస్యలను ఆవిష్కరించిన చిత్రాలే.

ఆకాశంలో సగం అని, వీలైతే పార్లమెంట్‌లో సగం అని నినదించటం కాదు. స్త్రీని గౌరవించాలి. ఎక్కడ స్త్రీలు గౌరవించబడతారో, ఆదరించబడతారో అక్కడ దేవతలుంటారన్న పెద్దల వాక్కులను నిజం చెయ్యాలి అన్న ఉద్దేశంతో తెలుగు చలనచిత్ర రచయితలు స్త్రీల సమస్యలే ప్రధాన కథాంశాలుగా చిత్రకథలు రచించారు. రచిస్తున్నారు, రచించబోతున్నారు కూడా.

# మన్మధా.... ఓ మన్మధా

- టి. ఉదయ శంకర్
93944-89246

బాణాలేయకు...
మన్మధా.. బాణాలేయకు
పరమశివునంత స్థిరచిత్తం లేనివాళ్లే ఇక్కడంతా
నిన్నదుపు చేసే మూడోకన్ను లేదుకానీ
చీరె కొంగులో... చుడీదార్ చున్నీలో అటుగా వెళితే
మూవీ కెమేరాల్లా రోడ్ సైడ్ బీటుగాళ్లకు ఒళ్లంతా కళ్లే

బాణాలేయకు...
మన్మధా.. బాణాలేయకు
తారకాసుర సంహారానికై కారణజన్ముడుకి జన్మనిస్తాడని కదూ
శివునిపై బాణమేసింది...
కానీ... నేడీ యుగాన...
కామజనులే గానీ కారణజన్ములు లేరయ్యా మన్మధా
"కామాతురాణాం న భయం న లజ్జ" నానుడి అక్షరమక్షరాన్ని
తలకెత్తుకున్న మదోన్మత్తులు
ట్వంటీఫోర్ ఇంటూ సెవన్ లా...
క్షణం క్షణం... కీచక టు ది పవర్ ఆఫ్ టెన్ థౌజెండ్స్
స్థాయిలో సెక్స్ బీస్టులున్న యుగాన
మన్మధా... బాణాలేయకు
మన్మధ బాణాలేయకు... మన్మధా

అసలే... కళ్లకు కంప్యూటర్ స్క్రీన్‌లు అతికించుకున్న కుర్రకారు
అదుపుతప్పిన కారులా తయారైన కానికాలం...
కంటిరెటీనా తెరలపై పోర్న్ సైట్ల వెబ్ మబ్బు కమ్మేసిన
క్షణికాల కాలం..
'నిర్భయ'ల గుండెల నిండా భయాలను,
ఒంటినిండా గాయాల గేయాల్ని,
పోస్ట్‌మార్టమ్ కత్తులు కూడా కన్నీరు కార్చేంత కర్కశాలను
మూటగట్టుకుంటున్న కలికాలం......
నువ్వేనాడో మానవ వికాసానికని వేసిన పూలబాణాలు..
ప్రేమతూణీరాలు
మా కాలంనాటి వికృత భీకృత చేష్టల ఉద్దీపనా వయాగ్రా
మాత్రలుగా అమ్ముకుంటున్నారు...కొనుక్కుంటున్నారు
ముసలి నక్కలు కూడా 'పులిరాజు'లా లేడీలపై పురుష పంజా
విసిరే నయాగ్రాలవుతున్నారు

అవునూ.. మన్మధా...
నువ్వు సంధించిన పూబాణాలు మనసూమనసు మధ్య



అనురాగాలు మారాకులు వేసి
సంసార నందనవనాన ప్రేమ ఫలాలు పూయించమని
కదూ...?
ఆ సుమధురాంశను మేమెక్కడో మిస్సయ్యాం....
తెలిసీ తెలియక అన్ని తెలిసినట్లే నటించేసి సర్వం
వికృతీకరించుకున్నాం...
ప్రేమంటే కామం అని అనువదించేసుకున్నాం...
నువ్వెలాగూ ఈ సంవత్సరం పేరున అరవై వసంతాల
తరువాత మళ్లీ వచ్చావు కదా...
అసలైన వ్యాకరణం చెప్పు...
మనిషిని మనిషిగా ప్రేమించే బాణం వెయ్యి...
మనిషిని మనసున్న మనిషిగా మార్చే మానవతాబాణం
సంధించు......
ఏ ఆడపిల్ల తల్లీదండ్రీ భయపడని నిర్భయాలను ఉద్దీపన
చేసే శరాలను వర్షించు..... లేకపోతే...
ధూర్తులు కామాంధులు మెసలే యుగాన సైతం చరిస్తూనే
ఉన్న
వీరేశలింగాలు, గురజాడలు, భగత్సింగ్‌లు, క్లారాజెట్కిన్‌లు..
నిన్ను సైతం కాల్చి బుగ్గి చేసిన త్రినేత్రులవుతారు...
రౌద్రనామ వత్సరాలవుతారు...
కదనకుతూహల రాగాలనాలపిస్తారు.

కథ

# మనోబింబం

- వడలి రాధాకృష్ణ
99853 36444



ఎన్ని నీటి వనరులు ఉన్నా... కలకాలం కాలువలు ఏరులైపారుతాయని మంచి పేరున్నా.... గట్టు ఏమిటి, పుట్ట ఏమిటి మీద అంతా పచ్చదనాన్ని దుప్పటిగా కప్పేసుకున్నట్లు సొగసుల్ని చిందిస్తూన్న ఊరులో ఏడాదికి మూడుపంటలు పండించగల మగాడు ఎక్కడైనా ఉన్నారా అంటే అది గవరరాజు లాంటి చేవ గల్గిన రైతులు అక్కడ మాత్రమే అగుపిస్తుంటారు.

ఇది నిజం.....

పాటిపట్నంలో గవరరాజు కమతమంటే ముప్పొద్దులా చేనును దుక్కిదున్నుతూ ఉంటుందని, ఫిల్టరు పాయింటు వేసి నీటిని వెదజల్లుతాడని, ఎరువులు వెదజల్లి సేంద్రియ వ్యవసాయాన్ని శాస్త్రీయ పద్ధతులలో చేస్తాడని ఎంతో మంది ముక్కున వేలేసుకొనేవారు.

సంవత్సరానికి మూడు పంటల్నీ తెచ్చేస్తాడని ఇప్పుడే కాదు గవరరాజు తండ్రి గురుమూర్తి రాజు హయాం నుండి పాటి పట్నానికి పెద్దపేరు ఉండేది.

ఆ పేరు చెదిరిపోకుండా ఈయనగారు తండ్రి వారసత్వాన్ని కాపాడుకుంటూ వస్తున్నాడు.

అవడం ఓ మోస్తరు పల్లెటూరు. అయినా మేము దేనికీ తీసిపోమని, ఎందులోను వెనుకబడిపోలేదని చెప్పుకోవడానికే కాబోలు పట్నంకాని పల్లెటూరికి పాటిపట్నం అనే పేరును సార్థకం చేసేసుకున్నారు.

ఊరిలో కూలీనాలీ జనాలు ఎక్కువగా రాజుగారి కమతంలో కూలిపనికి చేరిపోవడానికి ఇష్టపడతారు. దానికి అనేక కారణాలు లేకపోలేదు. గవరరాజు పాటిపట్నంలోనే కాదు ప్రక్కనున్న పది పల్లెటూర్లతో పోల్చుకుంటే నాగళ్ళను తీసిపారేసి ఆ పాత రోజుల్లోనే కొత్త ట్రాక్టర్లను పొలాల్లోకి దించి పారేశాడు.

దుక్కి దున్నులపుడు, కుప్పల నూర్పులప్పుడు రాజు ట్రాక్టర్లు కళ్ళేలలో పరుగెడుతూంటే కుర్రకారుకి కారు ఎక్కినంత పండగగా ఉండేది. అలాగే మెట్ట పొలానికి ఎడం కాలువలోని నీరు ఎక్కబోవడం లేదని ఏకంగా మూడు ఫిల్టర్ పాయింట్లని తెచ్చి బిగించేశాడు.

ఇక వరి ఊడ్పులప్పుడు... పెరిగిన పైరు కోతలప్పుడు ఎక్కువమంది ఆడంగులను పనికి పిలిచి పదిరూపాలయలు ఎక్కువ ముట్టజెబుతాడన్న మంచిపేరునూ సంపాదించేశాడు.

ఏమయితేనేమి రాజు ఏమి మాయ చేశాడోగాని పోయిన ఆగస్టు పదిహేనురోజు జెండాలు ఎగురవేస్తూ జిల్లా కలెక్టరు గారు గవరరాజుకి "జిల్లా ఉపాధ్యాయ రైతు" అని ప్రశంసించి మెడలో మెడలు వేసేసరికి గవరరాజు కీర్తి అమాంతం ఆకాశాన్నంటిపోయింది.

ఊరులోని అనేక నన్నకారు రైతుల మధ్యలో వెలుగుతూన్న పెద్దకారు రైతు గవరరాజు గారి వ్యవసాయ కమతంలో కూలీనాలీ చేయడానికి ఇష్టపడని ఆడది....ప్రయత్నించని మగాడు ఒక్కడు కూడా లేడంటే నమ్మశక్యం కాదు.

రాజు వాళ్ళ నమ్మకాన్ని ఒమ్ము చేయడం లేదు. వచ్చినవారికి వచ్చినట్లు పని కల్పిస్తూనే వున్నాడు. ఒళ్ళు దాచుకోకుండా చెమటోడ్చి పనిచేసే వాళ్ళకు ఒక కూలీ... ఒక మోస్తరు వారికి కాసింత తక్కువ కూలీని ప్రకటిస్తూనే ఉన్నాడు. దానితో రాజు దృష్టిలో పడాలని అనేక మంది ప్రయత్నించిన వారు ఉన్నారు. వారిలో నఫలీకృతులైనవారు, నిరాశతో సర్దుకున్నవారూ లేకపోలేదు.



అలాంటి పనివారల మధ్య గవరరాజు దృష్టిలో పడాలని ఎన్నాళ్ళనుండో అదే పనిగా ఉవ్విళ్ళూరుతూనే ఉంది. ఆ పడుచుపరువం.

కోతలు కోసిన తర్వాత వరికంకుల్ని మోపుగా కట్టి భుజానకెత్తుకొని గట్టుమీదకు చేరవేస్తున్నప్పుడు, వాటిని మరల విప్పదీసి క్రమంగా కుప్పవేసేటప్పుడు, మగమంద గుంపుగా కొట్టాం మీదున్న వరికంకుల్ని బండకేసి బాదిన తర్వాత ధాన్యాన్ని వెదురు చేటలతో ఎగరేసి పొల్లును వేరు చేస్తున్నప్పుడు ఎవరూ చూడకుండా రాజువైపు అలా కొంటె చూపుల్ని విసిరిన సందర్భాలూ లేకపోలేదు ఆమె.

ఇటువంటివి తనకు అనుభవమే కావడంతో రాజు దానిని చాన్నాళ్ళు పట్టించుకోలేదు. కానీ తనవైపు అదోలా చూస్తున్న ఆడతనపు పడుచుసిరిని చివరకు పట్టించుకోకుండా ఉండలేకపోయాడు.

చిన్న రాయి వేసి చూద్దామని కంటితో కన్ను కలిపాడు. ఈగవాలినట్లు అభినయించి తన కోరమీసం దువ్వాడు. మత్తును మంద్రతతో రంగరించేసి అరనవ్వు నవ్వాడు.

ఎన్నాళ్ళనుంచో ఆశపడుతూన్న ఆమెకు క్రమంగా రాజు పరిభాష అర్థమవుతూనే ఉంది. సిగ్గురాకపోయినా సిగ్గుపడింది. ఆ సిగ్గులతో సింగారాలను చిందిస్తూనే ఉంది. అలా చిందించడంలో నువ్వు నాకు నచ్చావు రాజయ్యా అన్న భావనను పసికట్టాడు గవరరాజు.

ఆమెను పెదిమలు కొరుక్కుంటూ తేరిపార చూశాడు. ఏ మాత్రం సందేహం లేదు. ఒళ్ళు దాచుకోకుండా పని చేసే మనిషే! అందుకే మంచి కాయకష్టం చేసిన ఆమె శరీరం నిగనిగలాడిపోతోంది.

అంత తెలుపూ కాని, నలుపూ కాని ఆమె ఛామనచాయ శరీరాన్ని శ్వేదజలం పూర్తిగా తడిపేసి ఉంది. ఎండ సూర్యుడి వేడిమి కిరణాలు ఆ చెమట బిందువుల మీద పడేసరికి అవి వింత వింతగా మెరుస్తున్నాయి. ఆ మెరుపులు తళుకులు గవరరాజులో వేడిమికొలిమిని రగిలిస్తున్నాయి.

ఇప్పుడు ఆయనగారికి ఏదో అయిపోయినట్లుంది. అంతకుముందుర వరకు మిల్లులకెత్తిన ధాన్యం తాలూకు బకాయి వసూళ్ళ కోసం కమీషన్ దారుల దగ్గరికి పట్నానికి తానేపోయి వచ్చేవాడు. కానీ ఇప్పుడు వెళ్ళబుద్ధికావడం లేదు. పొలాలన్నీ, కమతాన్ని కనిపెట్టుకొని ఉంటున్నాడు. డబ్బులకోసమని కమీషన్ దార్లకు ఫోన్లు చేసి కొడుకును పంపిస్తున్నాడు.

రాజు ధోరణిలో వస్తున్న మార్పులనన్నింటినీ కూలీజనాలలో మేస్త్రీగా చెలామణి అవుతున్న జాలారి ఇట్టే పసికట్టేసింది. ఆమె తన తండ్రి గురుమూర్తి రాజు కాలం నుండి తమ కమతంలో పనిచేస్తూనే ఉంది. అందుచేత కొంత స్వతంత్రం ఉంది ఆమెకు.

అందుచేతనే నీకు 'తల్లి'లాంటి దాన్నని అప్పుడప్పుడు వరసలు కలిపి మాట్లాడుతోంది కూడాను. రాజు ఆమె ఏమన్నా పెద్దగా పట్టించుకొనే రకం కాదు. కారణం అనేక సంవత్సరాలుగా తెలుసును తనకు పదే పదే అడిగిచూసింది. ముచ్చటని మనసులో దాచుకుంటే ఏముంటుంది రాజూ! బయట విదిలించేయే!! ఆమె మాటలు తాపాన్ని రిగిలిస్తూనే ఉన్నాయి. గవరరాజు సిగ్గుపడ్డాడు. మొహమాటంతో అటువంటిది ఏమీ లేదు. పొమ్మన్నాడు.

'లేదనకు రాజు! ఉన్నదన్నప్పుడే మనిషి మొగోడవుతాడు. సెప్పు!" పెద్ద వేదాంతిలా జాలారి మాట్లాడేసరికి మనసు తనంతట తాను విప్పారేసింది. మనసుమాట, గుండెగుట్టును బయట పెట్టేసింది.

'అదా! దానికింత మొలలేని వోడిలాగ అలా మెలికలు తిరిగిపోతావేంటి' అది గరువుమీది బక్క చిట్టిగాడి పెళ్ళాం.. గంగాజలం.

'గంగాజలం' గవరరాజు మనసు శరీరం తీపిగా మూలగసాగాయి. తెలియని వేదన తదేకంగా చుట్టుముట్టేసి

నిలువనీయకుండా చేస్తోంది. కానీ అంతమంది ఆడాళ్ళ మధ్యలో విషయం బయటకు పొక్కినాదంటే...

'ఛ..'.. తనలో తానే సమాధాన పడుతున్నాడు.

'నీ పని ఇకనుండి గట్టుమీదే! కొనుగోలుకి కమీషనుదార్లు వస్తారు. తూకానికి కాటావోళ్ళొస్తారు. ఫిల్టరు పాయింటు మోటారు కనెక్షన్‌కి కరెంటోళ్ళు వస్తారు. అందరికీ నువ్వు మంచినీరు అందివ్వాల.. కాఫీలు పంచాల!

రాజు మనసు యొక్క గ్రహణశక్తిని గ్రహించిన జాలారు గంగాజాలాన్ని అంత మూకలోంచి తప్పించి గట్టెక్కించేసింది.

ఆడమేస్త్రీ ఏ పని పురమాయించినా ఒళ్ళు దాచుకొని కూర్చోవడం చేతగాని గంగాజలం అప్పజెప్పిన పనిని కామందు మెచ్చుకొనేలా చేస్తూనే ఉంది.

'నువ్వు బక్క చిట్టిగాడి పెళ్ళాంవటగా! ఎవరూ లేనప్పుడు కాఫీగ్లాసు అందిస్తున్న గంగాజలాన్ని కదిపి జూశాడు.

'అవునన్నట్లు నిలువుగా తలూపింది.



అమాయకుడు అణ్ణి అనవసరంగా పనిలోంచి పీకిపారేశాను. రేపట్నుంచి వచ్చేమను. మందిలో ఆడూనూ.

గంగాజలం కళ్ళు అనందంతో మెరుస్తున్నాయి. ఆ మెరుపులో తన భర్తను తిరిగి వనిలో పెట్టుకుంటున్నందుకు కృతజ్ఞత కనబడుతోంది. కామందు పట్ల విశ్వాసము.. విధేయత అగుపిస్తోంది.

అవును ఆడి ఆరోగ్యం సరిలేదని, ఎండలో నిల్చొని పనిచేయలేకపోతున్నాడని అప్పట్లో రెండు మూడు సార్లు పనివ్వక ఆపేశాడు.

కానీ ఇప్పుడు.... గంగా జలానికి సంతోషంగా ఉంది.

'అవునే పిచ్చిమొగమా! నిన్ను చూశాను. చేనుకు పనికొత్తన్నావు నాకు పనికిరాక పోతావా అని.. అరకొర చూపుతో చూశాడు.

చిన్నగా నవ్వింది. గుంభనంగానూ నవ్వింది. ఆ నవ్వులోని అర్థాలు గవరరాజుకి ఎరుక అవుతూనే ఉన్నాయి. అలా నవ్వుకోవడంలో కొద్దిగా ప్రక్కకు జరిగిన పైటను సర్దుకోవడం మర్చిపోయింది.

'ఇక లాభంలేదు రాత్రిపూట గట్టుగుడారం లోని పెట్రోమాక్స్ లైట్‌ని ఆర్పాల్సిందే' గంగాజలానికి విషయం బోధపడుతోంది. చెప్పాలంటే తనకు కావల్సిందీ అదే! మౌనాన్ని అంగీకారంగా చేస్తోంది.

కుప్పనూర్పులయిన తర్వాత రాశిగా వేసిన ధాన్యం రాత్రివేళ దొంగతనానికి గురికాకుండా, ఎవరూ ముట్టుకోకుండా ఉండటానికి రాశికి మసి ముద్రలు వేయడం ఆనవాయితీ ఆ వనిని జాలారి గంగాజాలానికి పురమాయించింది.

ఎవరూ లేని ఆ కారు చీకటిలో గడ్డిమంట తన శరీరంలో తీపివేదనను రగిలిస్తోంది. మంట వెలుతురులో గంగాజలం శరీర అందాలు తనను అదే పనిగా మురిపిస్తున్నాయి. కోరికల్ని పట్టి పైకి లాగిపారేస్తున్నాయి.

అవనరానికొచ్చిన ఆడదాని ప్రక్కన చటుక్కున కూలబడ్డాడు గవరరాజు సన్నగా నవ్వింది కాదనలేదామె.

'నచ్చానా'!

'నచ్చినందుకే కదా ఇంటికాడ మొగుడి పడకకి మంచమేసి, నిద్రకు బిళ్ళేసి లగెత్తుకొచ్చేసింది.

చటుక్కున చేయిపట్టుకున్నాడు. తాపాలన్నీ తాదాత్మ్యకం చెందినట్లున్నాయి. గవరరాజు తన నుండి తాను విడివడిపోతున్నాడు.

గంగాజలం చేయి పట్టుకొని తన చెక్కిలికి ఆన్చుకున్నాడు. ఆమె మొహాన్ని అటుగా త్రిప్పుకొని జడలో చేయంతుల్ని ముఖంతో తనవితీరా స్ప్రశించాడు. ఆ వింతైన వానన గవరరాజుని మంత్రముగ్ధుణ్ణి చేస్తోంది. ఆ సువాసనలు తనకు కావాలి. దానిని సంతరించుకున్న గంగాజలమూ కావాలి. మంటలు కొరవడిపోయిన ఏకాంత క్షణాలు. మీదకు లాక్కొని గాఢంగా హత్తుకున్నాడు. ప్రతి భంగిమకు జవాబుదారీ తానంటూ తన పెదిమలతో చుంబిస్తున్నాడు.

ఇంతకాలం అంతగా ఎరుగని ఒక అలౌకిక జీవన స్పర్శ్య ఆమెను పూర్తిగా చుట్టుముట్టేసేసరికి ఎదుట నిండు రాజసానికి వత్తాసు తానవుతోంది.

తనకు తెలియకుండానే వంటి వస్త్రాలు వేరుపడుతున్నాయి. ప్రక్కనే ఉన్న నులకమంచం పట్టిమంచంలా అగుపిస్తోంది.

గంగాజలం తన మనిషన్నట్లు.. తనకే స్వంతమైనట్లు.... తనివి తీర్చనివి... తనివి తీర్చినివి అన్నింటినీ ఆస్వాదిస్తున్నాడు. ఉచ్వాసతప్ప నిశ్వాస అంటూ ఎరుగని గంగాజలం కోరుకున్న సౌఖ్యం పొందగోరేసరికి పొందులోని మధురిమలు అతని నుండి ఆవెం అందుకుంటూనే ఉంది. దర్పంతానై హత్తుకుంటున్నాడు. అందాల్ని ఆస్వాదిస్తూ పరువాల మధ్య పరవశిస్తున్నాడు. అదే గంగాజలానికి ఇష్టం కూడాను.

'ఏం రోజూ! రాత్రి, మసి ముద్రలు పడ్డాయా!! 'జాలారి వరాచకమాడింది'. నిద్రలేని రాత్రికి మసిముద్ర లెందుకమ్మాయ్.

'రాత్రి అంతా మేలుకొనే ఉన్నారన్న సంగతి తన శరీర భాషను పట్టి జాలారికి అర్థమవుతూనే ఉంది.

అలా గంగాజలం గవరరాజుకి దగ్గరయిపోయింది.

'గంగా! ఈ చీరలో ఎంత ముద్దుగున్నావో తెలుసా! 'ఏపుగా ఎదిగిన మామిడితోటలోని, విరగకాసిన మామిడి చెట్టుచాటున దగ్గరగా లాక్కున్నాడు ప్రేమగా హత్తుకున్నాడు.

అతని గుండెల మీద గోముగా వాలిపోయి రాజు గుండె గుసగుసల్ని ఆలకిస్తోంది గంగాజలం.

చెప్పాలంటే గంగాజలానికి ఊహించనటువంటి అనుభవం ఇది. ఇంతకు ముందెన్నడూ లేని ఆ సుఖం గొప్పగా ఉంది. అవును చిట్టిగాడు తనకు మొగుడు అన్నమాటే గాని ముద్దు లేదు.. మురిపెమూలేదు. చేస్తే ఏదో పనిచేయడం.. పోతే రాత్రికి సెకండ్ షో సినిమాకి పోవడం, లేకుంటే మునుగేని మూడంకెవేయడం.

ఇక శీతాకాలం వచ్చిందంటే సరేసరి. లోపల నక్కి ఉన్న ఉబ్బసం రోగం శరీరాన్ని ఎసనుదోసుకొని వచ్చేస్తుంది. అప్పుడు తాను కునుకెయ్యడు. తనని వేయనివ్వడు. గుండె బరువెక్కినట్లుయింది. అంతలోనే సర్దుకొంది.



'ఏమయిందే! బిగికౌగిలిలో ఇమిడిపోయిన ఆమెను ఎక్కడెక్కడో తడుముతున్నాడు గవరరాజు.

'లేదయ్యా'

'చెప్పేహే! మల్లెల్ని ముట్టలేదనా' జడలో విచ్చుకొని వ్రేలాడుతున్న పూలచెండుల్ని చేతిలోకి తీసుకున్నాడు.

'ఊ...ముట్టకపోవమేంటి! అన్నింటినీ ముట్టేశావు గదా!'

'నిజమే గంగా.. ముట్టిన నువ్వు నా దానివి ఇప్పుడు.... ఎప్పుడూ కూడాను?

'నమ్మమంటావా!'

రాజును నమ్మాల్సిందే! మోజుపడ్డదాన్ని మెడలమీద ఎక్కించుకుంటాడు' అతగాడి మాటలకు పొంగిపోతోంది. ఈ జన్మకు తనకీ తోడు చాలు. ప్రేమగా గవరరాజుని పెనవేసుకుపోయింది.

గంగాజలం గవరరాజుతో తిరుగుతోందని అందరికీ తెలిసిపోయింది. అసూయాపడేవారు కొందరైతే, అవహేళన చేసి ముక్కు మీద వ్రేలేసుకొనే వారు మరికొందరు. ఎవరూ విషయాన్ని చర్చించుకోవడానికి సాహసించడం లేదు. సాహిసిస్తే ఏమవుతుందో తెలుసు.. పనిలోంచి పీకి పారేస్తాడు.... లేదా రోజు వారీ కూలీ డబ్బుల్ని కోసి పారేస్తాడు.

గంగాజలం గంగాజలంలా లేదు. ఈ మధ్య మరీ మెరిసిపోతోంది. ఒంటికి కొత్త నిగారింపులు వచ్చి చేరిపోయాయి. కొత్త అందాలతో పొంగిపోతోంది. పాతబడిన చీకు బట్టలు పోయాయి. పాలిస్టర్ బట్టలు వచ్చేశాయి. రోజూ ఫారిన్ నూనెలను తలకు రానుకొని నువానలతో వెలిగిపోతోంది.

చెప్పాలంటే కామందు తోటిపొందు ఆమె బ్రతుకును బ్రతికిస్తోందనే చెప్పొచ్చు! రాజుతో తిరగడం మొదలుపెట్టిన తర్వాత ఇంట్లో చిట్టిగాడికి మంచి తిండిపెడుతోంది. తాను కడుపునిండా తినగల్గుతోంది.

మొగుడి ఉబ్బసం వ్యాధికి చేపమందులు, రొయ్యల మందులు మాత్రమే కాకుండా ఒకటిరెండు సార్లు ఇంగ్లీషు డాక్టరుకి చూపించింది కూడాను. అదిమాత్రం ఆమెకు కొంత సంతృప్తిని, ఆత్మస్థైర్యాన్ని ఆపాదించిపెడుతోంది.

గవర్రాజు గంగాజలంతో పూర్తిగా మమేకమైపోయి ఉన్నాడు. ఇంటిపట్టున ఉండకుండా పొలం వ్యవసాయమంటూ గట్టు గుడారం లోనే ఎక్కువగా గడుపుతున్నాడు.

కొడుకును, భార్యను అయిన వాళ్ళని పొలాల వైపు రావడానికి ఇష్టపడటం లేదు. ఒక ఆడదాని మోజులో పడి పూర్తిగా మునిగిపోయిన మనిషి ఎలా ఉంటాడో అలా తయారయింది గవరరాజు వరస.

చంద్రుడు విస్తరిస్తూన్నవేళ... వెన్నెల విరబూస్తూన్నవేళ గవరరాజు ఒడిలో గంగాజలం నలగుతూనే ఉంది. తన పొందుకోసం అదేపనిగా వెంపర్లాడిపోతున్న అతగాడికి అన్నీ తానయి, అన్నింటినీ అందించి అలరిస్తూనే ఉంది. ఒక పెద్ద వెన్నెల వర్షం కురిసిన తర్వాత చెదిరిన కురులను సరిచేసుకుంటూ రాజు ప్రక్కనుండి కొంచెం విడివడింది.

అతని ముఖంలో ముఖం ఉంచి మొదటి సారి నెమ్మదిగా నోరువిప్పింది.

'రాజూ..'

'చెప్పవే పిచ్చి మొగమా! బంగారమా.. పట్టుచీరలా.. రేపు పట్నానికి పోదాం పద'

'నీ మాట కాదన్నదెవడు. ఊ అను...'

'ఆ మాటలేమీ గంగాజలానికి పట్టడం లేదు. తనకు బంగారం మీద... చీరల మీద అంతగా ఆశలేదు. అడగక

తప్పక నెమ్మదిగా నోరు విప్పింది.

'రాజూ...'

కడుపులోమాట కక్కేయవే పిచ్చిమొగమా!'

'చిట్టిగాడు శీతాకాలం చలి ఉబ్బసాన్ని తట్టుకోలేక పోతున్నాడు'! ఊరి చివర ఇంగ్లీషు డాక్టరు సూదిమందులు పొడిపిస్తూనే ఉన్నాను. కానీ పట్నం లోని పెద్ద డాక్టరు కాడ ఆడికి నువ్వు మెరుగైన వైద్యం చేయిత్తావని!'

'సూదిమందు డాక్టరు పట్నంలో ఇరవై వేలు అవుతుందని సెప్పినాడు అంటూన్న గంగాజలం కుడిచేయి తన ప్రమేయం లేకుండానే మెడలోని పసుపుతాడును తడిమి చూసుకుంటోంది.

సీను చూసిన గవరరాజుకి నవ్వు ఆగడం లేదు.

'అంతవరకెందుకులేయే! గవర్నమెంట్ డాక్టర్‌కి ఫోన్ చేత్తాను నాలుగు ఇంజిక్షన్లు పోవరు పెద్దవి తెచ్చి పొడిచిపారేత్తాడు. అప్పుడు ఈ చలికాలమంత గ్యారంటే!'

'ఒట్టేసి సెబుతోన్నా! ఆడికి పుంటం వైద్యకం సేయించి సాయం సేసినావంటే కాయకష్టం చేసి నీ అప్పు తీర్చేత్తానయ్యా!'

పిచ్చిగా పలకమాక, నీకు నేను నాకు నువ్వు మధ్యలో ఒట్లు సత్తాలేమిటే...'



'చెప్పు బంగారం సేయించనా.. అరడజను బొంబాయి సీరలు తెప్పించేయనా' కట్టినావంటే కమతంలోని ఆడంగుల కళ్ళు ఎర్రబడేలా ఉండా' గవరరాజు పిచ్చి ప్రేలాపనలు హితవుగా అన్పించటం లేదు.

'ఇంటికాడ శాన బోధపడిపోతన్నాడు. పట్నం లాక్కెళ్లి ఆడికి పెద్ద వైద్యం సేయిత్తావని' ఆశగా అడుగుతోంది. రాజు తన మాటకు ఒప్పుకుంటాడన్న నమ్మకముంది. పక్కలోకి లాక్కొని తనకు పెనిమిటినంటున్న గవరరాజు చిట్టిగాడికి సాయం సేత్తాడన్న నమ్మకముంది.

'సన్నాసి ఎదవ.. ఆడేంటి సెప్పు నీకు.. నీకు నేనున్నాన్!'

'ఎదవ పోతే పోతాడు.. బెంగపెట్టుకోమాక!

'నీకేం కావాలన్నా సేయించి ఇచ్చేత్తాను. మన మధ్యలో ఆడెందుకు... ఆడికి వైద్యం ఎందుకు సెప్పు! ఉబ్బసం ఎక్కువై ఊపిరాడక కళ్ళు తేలేసి నాడనుకో.. అప్పుడు నీకు నేను... నాకు నువ్వు' పకపకా నవ్వుతున్నాడు... పెద్దగా నవ్వుతున్నాడు.

గంగాజలం వీపుమీద పెద్ద పిడుగు పడినట్లయింది. తన మెడలోని పసుపుతాడును అదిమి పట్టుకొంది.

ఒక్కసారిగా ఇన్నాళ్ళుగా మోజుపడిన మనసు, రాజుకి దూరంగా జరిగిపోయినట్లయింది.

(ఆడు నాకు తాళికట్టినోడు.. కుంకం పెట్టినోడు!)

సెప్పాకదే! మధ్యలో మనకి ముళ్ళకంచె లెందుకంటున్నాను. ఆడుకంటిలో గుచ్చుకోనూగలవు... అరికాలులో దిగిపోనూగలవు.'

ఆడు తపీమన్నాడనుకో! గంగాజలం పర్మినెంట్‌గా గవర్రాజు గారికి!!' ఆమెను చుట్టేయబోయాడు. రెండడుగులు వెనక్కివేసింది. ఎంత చెడినా కట్టుకున్నోడిని తూలనాడుతూన్న కామందులోని ........నైజాన్ని ఇప్పుడు అసహ్యించుకుంటోంది.

ఇంతకాలం రాజు మగసిరిని చూసి మురిసిపోయి తనవన్నీ కావాలని ఇచ్చేసుకొంది.

కానీ ఇప్పుడు గంగాజలానికి తనను వంచన చేసిన మగాడు అగుపిస్తున్నాడు... తనను అత్యాచారానికి గురిచేసిన మారీచుడు అగుపిస్తున్నాడు. తనకు మళ్ళు అఖ్ఖరలేదు. మాన్యాలను ఆశించడం లేదు. బంగారు నగలు వద్దు.. పట్టుచీరలు అసలేవద్దు.

తనకు చిట్టిగాడు బాగుండాల.. మొకానికి కుంకాన్ని దిద్దిన ఆడు సల్లగుండాల... కాళ్ళకు వనువు అద్దిన మొగుడు ఆరోగ్యంగా సేమంగా ఉండాల....

చెప్పాలంటే మనను కుదవబెట్టేసి, సిగ్గును సంపేసుకొని ఇన్నాళ్ళూ రాజు దగ్గర పడుకున్నది కూడా కేవలం తన చిట్టిగాడి కోసమే! తన ఇంటి మగ మనిషి సల్లగుండాల... తర్వాతే రాజులయినా.. మహారాజులయినా...

చిట్టిగాడిని వలదన్న ఈ ప్రపంచంలోని ఏ మనిషీ తనకు అఖ్ఖరలేదు. అది గంగాజలం యొక్క ఖచ్చితమైన అభిప్రాయం. దానికి తిరుగుండదు కూడాను. ఇప్పుడు గవర్రాజును అలా విదిలించి పారేసి ముందుకు కదలిపోతోంది గంగాజలం.

ఆమెకోసం ఆరాటపడుతున్నాడు.. పిలుస్తున్నాడు... నిరంతరంగా పిలుస్తూనే ఉన్నాడు. ఏ మాటలూ ఆమె చెవిన పడటం లేదు.

అనేక కల్మషాలను సయితం తనలో ఇముడ్చుకున్న పవిత్ర గంగమ్మ తల్లిలాగ మును ముందుకు కొనసాగుతూనే ఉంది.

కొన్ని సామాజిక అవసరాల కోసం, అనేక ప్రతిబంధకాలను తనలో అనివార్యంగా కలుపుకోగల్గిన గంగాజలం, ఇప్పుడు గంగమ్మతల్లి అంతటి పవిత్రతను ఆపాదించుకొని ముందుకు అలా ప్రవహిస్తూనే ఉంది. ❧

## నానీలు

బండి ప్రసాదరావు
9866483732



జీవం అదే
జీవనం మారింది
కాలాన్ని దోషిని చేయడం
ఓ ముచ్చట

ఉపకారం
అమరము
జ్ఞాపకాల పొరల్లో
గతం పదిలం

విశ్వాసం
విధ్యుక్త ధర్మము
విశ్వసించడం
విచక్షణాంశం

మాటపై నిలవడం
కష్టంకాదు
మాటాడేది
మనసై ఉండాలి

నమ్మకం
జీవన సాధనం
కొనఊపిరయింది
నమ్మడం

విద్యార్థులు
కోకిల గ్రుడ్లు
పొదిగి పెంచేందుకే
గురువులు

జన సేవకే
ప్రతినిధులు
ధనసాధనలో
తలమునకలు

వారికి శుభాకాంక్షలా?
పక్కదారే...
సక్రమంగా
ప్రజాధనం

అవినీతికి
ప్రజాదరణా!!
అయితే...
దోషి అదికానేకాదు

రాళ్ళతో కొట్టి
చంపండి ! సరే
ఆమెతో
కులికినోళ్ళ సంగతి?

హుండీలో
అజ్ఞాత భక్తుడు
దోపిడీలలో
ఆగంతకరత్నే

నిమగ్నం
నిత్యదైవ పూజలో
తప్పులతో తన్మయం
నిరంతరం

మనసుకు
విశ్రాంతి కావాలా?
అయితే... శ్రమించు
అవిశ్రాంతంగా

---

## నవజీవన వేదం

- మార్పూరి శ్రీరామ్ ప్రసాద్
94904 55599

ఆకాశాన్ని అంగవస్త్రంగా
నేల పుప్పొడిని మేని పరిమళంగా
దిక్కులే నేస్తాలుగా
ఆకలి కడుపు కంచంగా
నిరాశ నిస్పృహలు తోబుట్టువులుగా
జీవన సమరంలో క్షతగాత్రుడైన
ఆ అభాగ్యున్ని చూడు!

లాలన, పాలనకు వెలియై
దోపిడీ పీడనలకు బలియై
రుధిర సముద్రాలను తన కన్నులలో
భరిస్తున్న ఆ వేదనా జీవి వంక
ఒక్క క్షణం చూడు!
ఆకలి, ఆగ్రహం 'తీవ్ర' వాదమై
ఉగ్రరూపం ధరిస్తే
ఆ తప్పెవరిదంటావ్!
ఓదార్పుల పై పూతలు



కరచాలనాలు కౌగిలింతలు
మాన్పలేవు గాయాలు
చల్లార్చలేవు ఆకలి భగభగలు
దారిద్ర్యం మోయలేని బరువు
ఆకలి తీర్చలేని కరువు
ఆకలి మనిషిని సమాధి చేయక మునుపే
అసమానతల కార్చిచ్చు
సమాజాన్ని దహింపక మునుపే
మనుషులుగా మేల్కొందాం
మానవతా గీతాలను ఆలపిద్దాం
బడుగుల బ్రతుకుల్లో
బృందావనాలు సృష్టిద్దాం
అపర బ్రహ్మలమై
నవజీవన వేదాలను సృజిద్దాం

# సంస్మరణ

## ఒకే ఒక్కడు

- డా॥ కనుపర్తి విజయబక్ష్

సంఘసంస్కరణోద్యమంలో విరాట్ స్వరూపుడు, ఆంధ్ర వాఙ్మయ జగతిలో వచన భగీరధుడు, స్త్రీ జనోద్ధరణ కంకణబద్ధుడు, స్త్రీ విద్యా వ్యాపక కార్యశూరుడు, వితంతువివాహ ఆచరణశీలి, వివిధ సాహిత్య ప్రక్రియలకు శ్రీకారం చుట్టిన ఆద్యుడు, నిర్విరామ కార్యశీలి, విప్లవ విస్ఫులింగం 'వీరేశలింగం' ఒక్కడే కావచ్చు; కానీ అనేకులు చేయగలిగిన పనినంతా ఒంటిచేత్తో నిర్వహించాడు. సామాన్యంగా మహాపురుషులను వారి వారి జయంతులు, వర్ధంతుల సందర్భంగా సంస్మరించుకోటం ఓ ఆనవాయితీ

వీరేశలింగం జీవిత చరిత్రను ఆసాంతం చదువుతూ ఆయన నిర్వహించిన కార్యకలాపాలను, సాధించిన విజయాలను చూస్తుంటే ఆయన స్మృతి పథంలో నడయాడని రోజంటూ వుండదు. అందునా ఈనాడు శాస్త్ర సాంకేతిక రంగాల్లో అద్భుత విజయాలను సొంతం చేసుకొంటు, ఆధునిక జీవశైలిని అణువణువున నింపుకొంటూ సాగిపోతున్నాం అనుకొంటున్న ఈ తరుణం లోను ఆడవారి పట్ల విచక్షణా రహితమైన దాడులు, బాబాల అమ్మల చుట్టూ తిరుగుతోన్న ఈ మూఢ విశ్వాసాల వలలో చిక్కుకొన్న తీరును చూస్తుంటే ఓ వంద సంవత్సరాల వెనకనే ఇట్లాంటివన్ని సామాజికాభివృద్ధికి ఎంత అవరోధమోనంటు నెత్తీ నోరు బాదుకొంటు జనాలకు చెప్తూ ఓ మహానుభావుడు జీవించాడు. సాహిత్య సంస్కరణల బాట వెంటనే ఆయన జీవితమంతా కొనసాగింది. అంతే కాదు - సంస్కరణ కార్యకలాపాలకు సాహిత్యాన్నొక ఉపకరణంగా స్వీకరించి మంచి ఫలితాలను రాబట్టిన దిట్ట ఆయన.

సాంఘిక వ్యవస్థలో చప్పున మార్పులు చేయటానికి జనం అట్టే అంగీకరించరు. నెల కొని వున్న వ్యవస్థ వల్ల అధిక సంఖ్యాకులకు నష్టం కలుగుతున్నా నోరు మెదపటానికి కూడా ఎవరు ఇష్టపడరు. సంఘ భయం, పాపభీతి... నలుగురు నడిచే దారిన వెళ్ళటంలోని సౌలభ్యం కొత్తదారిలో వెళ్ళటంలో వుండదు కదా! కొత్త ఆలోచనల ఆవిర్భావమే కొత్తదారులను వెదుకుతోంది. అటువంటి ఆలోచనలకు ఆమోదం లభించకపోగా కావలసినంత వ్యతిరేకత మాత్రం సిద్ధంగా వుంటుంది... ఆ వ్యతిరేకతలో నూత్న మార్గవిష్కర్తలకు హాని కలగచేయటమే కాక, ప్రాణాపాయ స్థితిని కూడా కలిగించగలరు. అటువంటి ప్రమాదాలను సైతం లెక్క చేయకుండా దృఢ చిత్తంతో పనిచేసే వాళ్ళు చాల అరుదుగా వుంటారు. ఆనాటికే కాదు ఆ



తర్వాతి తరం వారికి కూడా తాము చేపట్టిన కార్యకలాపాల వల్ల మేలు ఒనగూడుతుందనే స్థిరమైన అభిప్రాయంతో పనిచేసే వారే క్రాంతదర్శులు. అటువంటి క్రాంతదర్శే కందుకూరి వీరేశలింగం. ప్రముఖ అభ్యుదయ రచయిత కె.వి. రమణారెడ్డి అయితే వీరేశలింగం ఒక్కడే రామ్మోహనరాయ్, విద్యాసాగర్, రనడే, కార్వే, శార్ధా, తెలాంగ్, భండార్కర్ ఇన్ని చేతులతో ఇందరు చేసిన పనులు ఒక్కడు రెండు చేతులతో చేయబూనాడు. అంతేకాదు ఎడారి అంచున వ్యవసాయం చేయబూని ఎంతో గట్టి పంటను పండిస్తూ ఇసుకను దరిదాపులకు రానీయకుండా చేసిన కర్షకుడు కందుకూరి వీరేశలింగం అని అభిప్రాయ పడ్డారు.

నైతిక పునాదుల మీద మాత్రమే సంఘవ్యవస్థ బలపడుతుందనేది ఆయన ప్రగాఢ విశ్వాసం. అందుకే సంఘంలో నెలకొన్న దురాచారాలనెన్నింటినో తన రచనల్లో తూర్పారబట్టాడు. లంచగొండితనం, వేశ్యాలంపటత్వం, అధికారుల్లో నెలకొన్న అవినీతి వర్తనం దేన్ని గురించి రాయటానికైనా ఆయన జంకలేదు. మూఢ విశ్వాసాల వల్ల ఎంతో మంది డబ్బు, ఆరోగ్యం కూడా వృధా చేసుకోవటం కనులారా చూచిన ఆయన తన రచనల్లో అర్థం పర్థం లేని ఆచారాలనన్నింటిని దుయ్యబట్టాడు. చేతబడులు, ముహుర్తాలు, శకునాలు, దయ్యం పట్టటాలు, అంజనం వేయటం, సోదెలను నమ్మటం, జ్యోతిష్యానికి అనుకూలంగా నడుచుకోవటం, గ్రహణస్నానాలు, పూజారుల డంభత్వం, మోసం, ఆయన ఇదని అదని అనకుండా ప్రగతి బాటకు అడ్డుగా వున్న ఎన్నో విషయాలకు నిశితంగా విమర్శించాడు. ఇటువంటి నమ్మకాల్లో పస లేదని సోదాహరణంగా వివరించాడు.

ఇవి నచ్చని సమకాలీన చాంధసవాదులు ఆయన పై కక్షకట్టి అనేక రకాలుగా చీకాకు పరిచారు.

ఆయన తన స్వీయ చరిత్రలో చెప్పుకొన్నట్లుగా 'సంఘ సంస్కరణ సమాజ కార్యములయందును బ్రహ్మసమాజ ధర్మ వ్యాపకమునందును నాకు విశేషాభిమానము. ఈ విషయములలో

సహితము నాకు కార్యశూరత ప్రియము. క్రియశూన్యమైన కేవలం వాక్శూరత నాకు అప్రియము.

వీరేశలింగం జీవితమంతా 'కార్యవాది'గానే గడిపాడు. తాను నమ్మింది ఆచరించటం, అనుసరించేలా రచనల ద్వారా ఉపన్యాసాల ద్వారా, ఆచరణద్వారా అనుసరించేలా రచనలు ద్వారా ఒప్పించటం...ఆయన జీవితంలో ఏనాడు అన్నదానికి విరుద్ధంగా నడిచింది లేదు.

బ్రహ్మ మతానుసరణ ఆయన జీవితంలో పెను మార్పులను తీసుకువచ్చింది. కలకత్తా బ్రహ్మ సమాజ ప్రముఖులతో ఆయనకు చక్కటి సంబంధాలుండేవి. పండిత శివనాథశాస్త్రి రాజమండ్రి రావటం వీరేశలింగాన్ని కలవటం, వీరేశలింగం దంపతులు కలకత్తా వెళ్ళటం అక్కడ బ్రహ్మ సమాజాలవారిచే సన్మానం పొందటమూ జరిగింది. బ్రహ్మమత మందించిన ఉదార ఆశయాల ప్రభావం వల్లనే ఆయన ప్రార్థనాసమాజం స్థాపించటం, స్త్రీ జనోద్ధరణకు పూనుకోటం, వర్ణాచార ఖండనం.... ఇత్యాది చేపట్టింది. అంతేకాదు. ఈశ్వరుడంటే పూజాదికాలతో, కానుకలతో ముడుపులతో కొలవటం కాదని, కేవలం ప్రార్థన ద్వారా మాత్రమే సేవించాలనేది సిద్ధాంతం. అంతే కాదు భగవంతుని ముందు కుల మత వర్ణవర్గ వివక్ష వుండదని, అంతా సమానులేనని నమ్మటం - మానవ సేవే మాధవ సేవ అనేది లక్ష్యం.

స్త్రీ జనోద్ధరణ ఆయన నమ్మిన అత్యంత అభిమానాంశం. విద్య వుంటే తప్ప అభివృద్ధి సాధ్యం కాదని, అందుకు స్త్రీ పురుష భేధం అవసరం కాదని నమ్మి బాలికాపాఠశాలను 1874లోనే ప్రారంభించాడు. అంతే కాదు నిమ్న వర్గాలకు విద్యావశ్యకత వుందని వారికి పాఠశాలల్లో ప్రవేశం కల్పించారు. అంతేకాదు సాంఘిక సమస్యల పరిష్కారానికి పత్రికలనొక సాధనంగా ఆయన ఉపయోగించాడు. ఆయన దృష్టిలో యుక్తా యుక్త విచక్షణమే హేతువాదం. ఎటువంటి విద్య కావాలి అనే దానికి ఆయన స్పష్టమైన సమాధానం తన వివేకవర్ధిని లో వెలిబుచ్చాడు.

"ఆధునిక విజ్ఞానం ఒక దేవతలాంటిది ఆ దేవతను పాశ్చాత్యులు మన దేశానికి తీసుకొచ్చారు. ఆ దేవత ఆధునిక విజ్ఞాన జ్యోతిని తన చేతిలో పట్టుకొని తరతరాలుగా పేరు కొనిపోయిన అజ్ఞానాంధకారాల్ని తొలగిస్తూ ఉంది. ఆ వెలుగుకు మూఢాచారాలనే దయ్యాలు కాళ్ళకు బుద్ధి చెప్పుతున్నాయి. ప్రస్తుతం సత్యాసత్యాల మధ్య, విద్యా విద్యల మధ్య, ప్రాత క్రొత్తల మధ్య పోరాటం జరుగుతున్నది. ఈ పోరాటంలో ఎవరూ తటస్థంగా వుండకూడదు. ఏదో ఒక పక్షంలో చేరాలి. బుద్ధిమంతులైన వారు ఏ పక్షంలో చేరాలో అంతిమ విజయం ఎవరిదో చెప్పనక్కరలేదు. ఈ సంగ్రామం సుదీర్ఘంగా సాగవచ్చు. తీవ్రంగా ఉండవచ్చు. అయితే చివరికి జ్ఞానం, అజ్ఞానాన్ని, సత్యం అసత్యాన్ని తప్పక జయిస్తాయి. ఇక వీరేశలింగం చేపట్టిన అనేక కార్యాలలో మకుటాయమానమైనది స్త్రీ పునర్వివాహం, వితంతువులు ఆ రోజుల్లో ప్రతి ఆరుమందిలో ఒకరుండేవారట. బాల్యవివాహాలు, నిర్బంధ వైధవ్యం, స్త్రీల హీన దీన పరిస్థితి చాలా ఎక్కువగా వుండేది. వితంతు బాలికలకు తిరిగి వివాహం చేయటమనే ఆలోచనే భరించరానిదిగా వుండేది. అయితే ప్రతియుగంలోను సరికొత్త సామాజిక నియమాలను చట్టాలను నిర్మించుకోవాలనేది ఆయన వాదన. వితంతు పునర్వివాహానికి ధర్మశాస్త్రాలు కూడా అనుమతిస్తున్నాయని ఆయన ప్రమాణాలను సైతం చూపించాడు. ఉపన్యాసాలను బహిరంగంగా వినిపించాడు. పూర్వాచార పరాయణులు వారి వారి వాదనలతో ఎదుర్కొన్నారు. అట్లా రెండేండ్లపాటు పత్రికల ద్వారా, ఉపన్యాస వేదికల ద్వారా వాదోపవాదాల ద్వారా చివరికి అత్యంత వ్యతిరేకత మధ్య చివరికి ఆనందోత్సాహాల మధ్య 1881 డిసెంబరు 11న మొదటి వితంతు పునర్వివాహాన్ని జరిపించాడు. అట్లా తన జీవితకాలంలో దాదాపు 40 వరకు వివిధ ప్రదేశాలలో వివాహాలు జరిపించాడు. సంఘం వెలివేతకు కూడా వెనకాడని ధీరుడాయన.

అంతేకాదు తెలుగు వాఙ్మయంలో నవల, నాటకం, ప్రహసనం, జీవిత చరిత్ర, స్వీయచరిత్ర, ప్రకృతి శాస్త్ర గ్రంధాలు, ఇట్లా ఒకటేమిటి అనేక ప్రక్రియలకు ఆద్యుడు... అంతేగాదు... ఆధునిక తెలుగు పత్రికా రచనకు మూల పురుషుడు. 'వివేకవర్ధని' పత్రికను 1874 సం॥లో ప్రారంభించేడు. ఆ పత్రిక స్థాపించటంలో ప్రధానోద్దేశం 1. భాషాభివృద్ధి, 2. దేశాభివృద్ధి అని చెప్పుకున్నాడు. ఆయన అభిప్రాయాలను నిక్కచ్చిగా, సూటిగా వెలువరించటానికి 'వివేకవర్ధని' పత్రిక ఒక ఉపకరణంగా పనికివచ్చింది. పత్రిక నడపడం, అందునా అందరికీ రుచించని అంశాలతో నడపటంలోని కష్టాలు ఆయనకు తెలుసు. అందుకే ఆ పత్రికలో అప్పటి పరిస్థితులను చెప్తూ - 'లంచగొండితనాన్ని విమర్శిస్తే స్థానికోద్యోగుకు కోపం, వేశ్యా గమనాన్ని నిందిస్తే ఊరిలోని విటవర్గానికి బాధ-అర్థం పర్థం లేని మూఢాచారాల్ని ఖండిస్తే అజ్ఞానులు, స్వార్థపరులు గొంతు మీదికి వస్తారు. నీతిని పాటించకుండా, మతాచారాలకు ప్రాధాన్యమివ్వడం, కూడదంటే పూజార్లు, పురోహితులు పగబడతారు. ఇందులో దశాంశమైన ఈ పత్రిక ద్వారా సాధించి చూపాలంటే అనేకుల ఆగ్రహావేశాలకు గురి కావాల్సి వుంటుంది. అంతేకాదు ఆ పత్రిక ద్వారానే ఆయన మొదటగా పరిశోధనాత్మక **(Investigation)** జర్నలిజానికి బాట వేసాడు.

ఇటు సాహిత్యంలోను అటు సంస్కరణ రంగంలోను కేవలం సమాజహితాన్ని కోరి తన యావచ్ఛక్తిని ధారపోసిన అలుపెరుగని కార్యశూరుడు కందుకూరి. శత్రుభాకరుడుగ, స్త్రీజనోద్ధారకుడుగా, కవి పండితుడు ఆయన మరపురాని మనిషి. అంతేకాదు 'దక్షిణ భారతంలో ప్రధమ ఆధునికుడు. సర్ కట్ట మంచి రామలింగారెడ్డి మాటల్లో అయితే ఈ 'శకనిర్మాత' తెలుగు నాట సంఘసంస్కరణోద్యమం అంటే అది వీరేశలింగంతో ముడిబడి వున్నదే.

*(మే 27 కందుకూరి వీరేశలింగం వర్ధంతి)*

# ఒక సామూహిక దుఃఖగానం

- డాక్టర్ దిలావర్
98669 23294



సజల జ్వాలా నయనాలతో
కరిగి నీరై పోతున్న కొవ్వొత్తిని
గుండెలకు హత్తుకొని ఓదారుస్తున్న రాత్రి
ఆకాశమంత విచారంతో
'చుక్కలు చుక్కలుగా' కన్నీరు విడుస్తూ ఆకాశం
కకావికలవుతున్న మనసుతో
కన్నీరు మున్నీరై రోదిస్తూ మేఘాలు
సముద్రమంత దుఃఖ ఘోషను
తీరానికి మోసుకొస్తూ
బాధతప్త సముద్ర కెరటాలు
మృగాలను మించి మృగాళ్ళ విధ్వంసవేటుకు
కునారిల్లుతున్న తనలోని దుఃఖం
అరణ్యరోదన కాకుండా
జీరబోయిన పికిలిపిట్టల గొంతుతో
విలపిస్తూ అరణ్యం
గుండెలోంచి తన్నుకొస్తున్న దుఃఖం
కళ్ళలో శీతల మంచు బిందువులై
మసక బారిన చూపులతో గులాబీ
కలత చెందిన గుండెలతో
మంచు కన్నీటివానై కురుస్తూ ప్రకృతి
కాళరాత్రి కబంధ హస్తాల్లో బందీయై
బిగుసుకుపోయిన కాలాన్ని
కర్ణ కఠోర రాగాల్లోకి అనువదిస్తూ కాలభైరవులు.
అనాది వేదనను మూగగా వినిపిస్తూ
సమాధుల మీంచి వీస్తున్న హోరు గాలి
చందనపు చందమామల సుందర ముఖారవిందాలపై
అమానవీయంగా విరుచుకుపడి
వికృత నర్తనం చేస్తున్నందుకు
సిగ్గుతో తలవంచుకుంటూ యాసిడ్
కుల, మత, వర్గాలు మూకుమ్మడిగా విసిరేసిన
రెండు హృదయాల మనోజ్ఞ సంగమాన్ని
నెత్తురు మడుగులో ఓలలాడిస్తూ
కలయిక నెరుగని సమాంతర రైలు పట్టాలు
తుఫానులో చిగురుటాకుల్లా
వజవజ వణికిపోతున్న యువతుల్ని చూసి
నిప్పుచ్ఛరమవుతున్న పచ్చదనం సాక్షిగా
భారంగా నిట్టూరుస్తూ వృక్షాలు
పసుపుతాడు ఉరితాడుగా మారే కుట్రమధ్య
యీ లోకం లోకి ఒక కొత్తప్రాణిని వొంపుతూ
కలల కన్నీటి చారికలను ఎదలో ముద్రించుకుంటూ
నిస్సహాయంగా నిర్లిప్త అమ్మతనం
కదిలే బస్సుల్లో, రైళ్ళలో, క్యాబుల్లో
విలయ భీకరంగా ప్రవహిస్తున్న
కామాగ్ని జ్వాలాపాత వుప్పెనలో
దగ్ధమవుతూ ఆర్తారావాలు చేస్తున్న రాజధాని
హృదయ చషకం లోకి
బొట్లు బొట్లుగా వొంపుకుంటున్న రాత్రిని
విషాదం ఐస్ క్యూబ్‌లో కలుపుకొని
దుఃఖగానాన్ని ఆస్వాదిస్తూ మనసు
తంత్రులలోంచి చీకట్లోకి దూకి
ఆత్మాహుతి చేసుకుంటున్న వేదనా రాగాలను
ఆపలేని కడుపుకోతతో విషాదసారంగి

ఒక్క జ్యోతిని బతికించుకుంటే
వందజ్యోతుల్ని వెలిగించొచ్చు
ఒక్క జ్యోతి ఆరిపోతే మాత్రం
వంద జ్యోతులు ఆరిపోవడానికి దారితీయొద్దు
అందుకే
అలుముకుంటున్న చీకటి గుండెల్లో
వెలుతురు పాతరలమై పేలిపోదాం రండి!



# హేతువాద భావాలను వెదజల్లిన విశిష్ట రచయిత తాపీ ధర్మారావు

- సింహాద్రి నాగశిరీష
9866689326




*సమాజంలో వేళ్ళూనుకు పోయిన నమ్మకాలు, ఆచారాలు, మూఢ నమ్మకాలుగా చలామణీ అవుతున్న దృష్ట్యా, వాటి పూర్వాపరాలు క్షుణ్ణంగా అధ్యయనం చేసి అందించిన ఘనత తాతాజీ గారిదే. నేటికీ ఎంతో నిష్ఠగా ఆచారాలను పాటిస్తున్న వారి సంఖ్య ఎక్కువగా ఉన్నా, వాటి వెనుక ఆంతర్యం ఏమిటి? అవి అలాగే చేయాలనే నియమం ఎలా ఏర్పడింది? ఎందుకు ఏర్పడింది? అని ప్రశ్నిస్తే సమాధానాలు చెప్పగలిగేవారి సంఖ్య చాలా తక్కువ. ముఖ్యంగా నేటి యువతరానికి ఈ సత్యాలు తెలుసుకోవలసిన ఆవశ్యకత ఉంది. అలాంటి కోవకు చెందినదే ఈ ఇనుపకచ్చడాలు అనే పుస్తకం.*

తాతాజీ పేరు వింటే తర్కబద్ధమైన ఆలోచనా ధోరణికి పెద్ద పీట వేసే వారికి కావలసినంత విందు. ఇక గిరి గీసుకొని గుడ్డిగా జీవనయానం సాగించేవారికి ఎక్కడో ఓ చోట భుజాలు తడుముకోక తప్పదు. తాతాజీ పూర్తిపేరు తాపీ ధర్మారావునాయుడు. పాత సినిమాలు ఇష్టపడేవారికి 'తాపీ ధర్మారావు నాయుడు' అనే పేరు పలకరిస్తూ ఉంటుంది. వీరి రచనల విషయానికొస్తే దేవాలయాల మీద బూతుబొమ్మలెందుకు? పెళ్ళి దాని పుట్టుపూర్వోత్తరాలు, ఇనుపకచ్చడాలు, రాలు-రాప్పులు, పాతపాళి, కొత్తపాళి, విజయవిలాసము - హృదయోల్లాసానికి వ్యాఖ్య - ఇలా తోడుకోగలిగిన వారికి తోడుకున్నంత. వీరు అరసంలో సభ్యులు కూడా. తెనాలిలో జరిగిన ప్రథమ అభ్యుదయ రచయితల సంఘం సభకు తాతాజీ అధ్యక్షత వహించారు. విద్యార్థి దశలో ఈయన గ్రాంధిక వాది. గ్రాంధికవాదాన్నే సమర్థించేవారు. గిడుగు రామ్మూర్తి పంతులుగారి శిష్యులు కూడా. ఆయన ప్రభావంతోనే 'జనవాణి' పత్రికకు సంపాదకత్వం వహించే సందర్భంలో వ్యావహారిక భాషను మొట్టమొదటిగా ప్రవేశపెట్టారు. కాగడా పత్రిక స్థాపించారు. సమాజంలో వేళ్ళూనుకుపోయిన నమ్మకాలు, ఆచారాలు, మూఢ నమ్మకాలుగా చలామణీ అవుతున్న దృష్ట్యా, వాటి పూర్వాపరాలు క్షుణ్ణంగా అధ్యయనం చేసి అందించిన ఘనత తాతాజీ గారిదే. నేటికీ ఎంతో నిష్ఠగా ఆచారాలను పాటిస్తున్న వారి సంఖ్య ఎక్కువగా ఉన్నా, వాటి వెనుక ఆంతర్యం ఏమిటి? అవి అలాగే చేయాలనే నియమం ఎలా ఏర్పడింది? ఎందుకు ఏర్పడింది? అని ప్రశ్నిస్తే సమాధానాలు చెప్పగలిగేవారి సంఖ్య చాలా తక్కువ. ముఖ్యంగా నేటి యువతరానికి ఈ సత్యాలు తెలుసుకోవలసిన ఆవశ్యకత ఉంది. అలాంటి కోవకు చెందినదే ఈ ఇనుపకచ్చడాలు అనే పుస్తకం.

అసలు ఇనుపకచ్చడాలు అంటే ఏమిటి? అనే సందేహం వస్తుంది. అది తెలుసుకోవాలంటే కొంచెం వెనక్కి అంటే ఆదిమ మానవుడి దగ్గరకు వెళ్ళి రావాల్సిందే. ఆ కాలంలో దాహమేస్తే, పండ్లు ఏది దొరికితే అది తినటం. జతగూడాలని కొరిక కలిగితే దగ్గరలో ఉన్న స్త్రీ/పురుషునితో జతకట్టటం ఆ తర్వాత తర్వాత ఇది నీది. ఇది నాది అనే ఆలోచన అంటే ఆస్తి - అది భూమి రూపంగానో, జంతువు రూపంగానో స్త్రీ రూపంగానో తన స్వంతం కేవలం తనకే స్వంతం కావాలనే ఆలోచన. తన ఆస్తిపై తనకే పూర్తి అధికారం. మరొకరు దాని వల్ల లాభం పొందకూడదనే స్వార్థం. ముఖ్యంగా స్త్రీ, పెళ్ళికి ముందు ఎలా ఉన్నా పెళ్ళి తర్వాత మాత్రం పరపురుష సాంగత్యం చెయ్యకూడదనే నియమం వచ్చింది. ఇంత నియమంలోనూ గమ్మత్తైన వెసులుబాట్లు కూడా ఉన్నాయి. అదేమిటంటే ఎవరైనా అతిథి ఇంటికి వస్తే, అతిథి పూజపేరుతో ఆ ఇంటి ఇల్లాలిని అతిధికి అప్పజెప్పేవారు. ఇక్కడ పాతివ్రత్యానికి భంగం వాటిల్లదులెండి. ఇది ఇంతటితో పక్కనపెడితే ఆ స్త్రీ పాతివ్రత్యానికి భంగం వాటిల్లకుండా ఈ ఇనుప కచ్చడాలను కనిపెట్టారు. అదెలాగంటే ఆవు దూడ యజమాని అనుమతించినప్పుడే పాలు త్రాగటానికి వాటి మూతులకు చిక్కం బిగించినట్లు పురుషుడు ఇంటలేని సమయాన స్త్రీ పరపురుషునితో సంబంధాలు ఎక్కడ పెట్టుకుంటుందో అని వారి మర్మాంగాలకు తాళం వేసి మరీ భద్రపరిచారు. ఆ

తర్వాత బెల్టులతో సహా ఇనుప కచ్చడాలు బిగించారు. ఇదంతా పెళ్ళికి ముందు ఏం జరిగినా ఫర్వాలేదనుకునే రోజుల్లో ఆ తర్వాత 'అక్షతయోని' అనే మాటకు గౌరవం పెరిగాక, కూతురి కన్యత్వం కాపాడే బాధ్యత తల్లిదండ్రులది. అది ఋజువు చేయాల్సిన సందర్భాలొచ్చేవి. అందుకోసం మలమూత్ర విసర్జనకు వీలుండేలా ఉంచి మిగిలిన కటిప్రదేశం మొత్తం తోలుతోనో గుడ్డతోనో కుట్టేసేవారు. మరికొన్ని దేశాలలో కేవలం కామకార్యానికే చెదిరేలా ఉండే పసరు పూత వేసేవారట. అప్పటివరకు తల్లిదండ్రులు కన్యత్వాన్ని ఇలా కాపాడితే పాతివ్రత్యం కాపాడటానికి ప్రత్యక్షదైవాలు ఇనుపకట్లు కట్టారు. స్త్రీ అధికారం ఉన్న దేశాలలో మగవాళ్ళకు కూడా ఇలాంటివి ఉండేవని తాతాజీ చెప్పారు. కాకపోతే మగవాళ్ళకు ధరింపజేసిన సందర్భాలను గూర్చి ప్రస్తావించలేదు. ఏదేమైనా కన్యత్వం, పాతివ్రత్యం పేరులో ఇంత క్రూరంగా స్త్రీల పట్ల వ్యవహరించిన తీరు నిజంగా లజ్జాకరం. ఎంతసేపూ ఒకటే పాట పాడితే ఎలా? వినటానికి విసుగు కలుగుతుంది. అందుకే దీనిని ఒక అలంకారంగా మార్చేశారు. ఉన్న నగిషీ పనితనాన్నంతా దానిపై చూపించారు. అవి ధరించటమే ఉత్తమ స్త్రీ లక్షణంగా ఊదరగొట్టారు. గొలుసులు, గాజులు, ఎలాగో కచ్చడాలు అలాగే. ఎంత ఎక్కువ ఖరీదైంది ధరిస్తే అంత గొప్ప అనుకునేలా చేశారు. ఇదే కోవకు చెందినవి ఇప్పటికీ మనం చూస్తున్న మరుగుబిళ్ళలు, సిగ్గుబిళ్ళలు. వీటికి సంబంధించిన వాదనలన్నీ కూడా కూలంకషంగా చర్చించారు. తాతాజీ అన్నట్లు సామెతల్లో కూడా ఈ తాళాలు చోటుచేసుకున్నాయి. అవి తెలుసుకోవాలంటే ఈ పుస్తకాన్ని తిరగేయాలి మరి.

ఇవన్నీ ఒట్టి మాటలే అని కొట్టిపారేసేవారూ లేకపోలేదు. వారికోసం ఇప్పటికీ ఈ ఇనుపకచ్చడాలు మ్యూజియంలలో దర్శనమిస్తునే ఉన్నాయి. పోచెంజర్ అనే కచ్చడం త్రవ్వకాలలో ఎలా బయటపడిందీ అనేది కూడా వివరించారు. తాతాజీ పైగా వీటిని కనిపెట్టింది తూర్పు ఖండం వారే. అయితే వీటిని పాశ్చాత్యులే కనిపెట్టారనేది ఇటలీ వారి మరోవాదం. కానీ ఆ వాదం తప్పు. 13వ శతాబ్దంలో క్రూసేడ్‌లు జరిగిన కాలంలో యూరోపియన్ వీరులు తూర్పుదేశాలకు వచ్చి యుద్ధాలు చేశారు. అప్పటికే తూర్పున ఇనుపకచ్చడాల ఆచారం ఉంది. యుద్ధానికి వచ్చిన వారిని ఇవి బాగా ఆకట్టుకున్నాయి. తమ ప్రేయసులకు ఇలాంటివి లేకపోతే వాళ్ళేమీ పోకళ్ళు పోతారో అని వీటిని ఇండ్లకు మరలించారట.

ఇటలీ నుంచి మెల్లగా శతాబ్దాల వరకు వీటి ఉపయోగం ఉండేది వీటికి సంబంధించిన కేసులు కోర్టులో కూడా నడిచాయట. పాతివ్రత్యం పేరుతో ఓ శిల్పి తన భార్యను ఎలా వేధించిందీ ఒ కేసైతే, 1910లో పారిస్‌లో ఈ కచ్చడం వేసి భార్యను హింసించిన ఓ డాక్టరు కేసు 'పేరట్ కేసు' పేరుతో ప్రపంచవిఖ్యాతి పొందిందట. పైగా కచ్చడాలు తయారుచేసే కార్ఖానాలు ప్రకటనలు కూడా చేసేవట.

'మీ యింటి (భార్యలకు) పుట్టిన పిల్లలు మీకు పుట్టినవారే అన్న నమ్మకం నూటికి నూరుపాళ్ళు మీకు కావలసి వుంటే రక్షణం ఈ కచ్చడాలను వాడుక చెయ్యండి. లేకపోతే నిజం ఆ భగవంతుడికే తెలియాలి. ఎంత అమానుషంగా, నీచంగా హేయంగా ఉందో వేరే చెప్పనక్కరలేదు. పైగా సౌకర్యాలు, మెరుగులు, నగిషీలు కలిగి ఎంత కళాత్మకంగా ఉంటే అంత ఎక్కువ ఖరీదు. పైగా ఇప్పటికీ యూరప్‌లోనూ, అమెరికాలోనూ అప్పుడెప్పుడు పెద్ద మనుష్యులు డాక్టర్ల దగ్గరకూ, వైద్యయంత్రాలు తయారుచేసేవారి వద్దకు వెళ్ళి పాతివ్రత్యాన్ని కాపాడే సాధనాలు ఏమైనా ఉంటాయా' అంటూ ఎంక్వైరీలు కూడా చేసేవారట. ఈ వ్యాసాలన్నీ 1940లో తాతాజీ కాగడా వారపత్రికలో వ్రాస్తూ ఈ 'ఇప్పటికీ' అనే పదం వాడారంటే బహుశా నేటికీ ఆ ఛాయలు 'పెద్ద మనుష్యుల' కుటుంబాలలో కనబడుతాయేమో లోగుట్టు పెరుమాళ్ళకెరుక. అసలు 'పాతివ్రత్యం' అంటే ఏమిటి? ఇది కేవలం ఆడవాళ్ళకి మాత్రమేనా, మగవారికి అవసరం లేదా? మగవాళ్ళు ఎంతమందితో కావాలంటే అంతమందితో యధేచ్ఛగా తిరగవచ్చు. కానీ ఆడవాళ్లు స్నేహంకొద్దీ వేరే మగవారితో చనువుగా ఉన్నా సరే వ్యభిచారి అని బిరుదు తగిలించారు. స్త్రీ కఠోర విషసర్పం అన్నారు. అదే మగవాడిని మన కవులు 'ఎన్ని పువులన్ వ్రాలదు తేటి? / అట్ల, మగవాడును వానికి దోషమున్నదే?' అంటారు తెలివిగా సమర్థించారు. చెప్పేటందుకే నీతులుంది కదా!

మగవాడికి పిల్లలు పుట్టే అవకాశం లేకపోతే పొరుగు గృహస్థు దగ్గరకు పంపి తద్వారా పిల్లలను కన్నారు. ఇక్కడ కూడా పాతివ్రత్యానికి భంగం వాటిల్లదు. పైగా అదొక వంశాన్ని నిలబెట్టే పుణ్యకార్యం. ప్రకృతి స్త్రీ పురుషులను సమానంగానే సృష్టించింది. ఇద్దరి పుట్టుకకి, పరిణామక్రమం ఒకటిగానే ఉన్నపుడు ఇలాంటి అర్థంపర్థంలేని కట్టుబాట్ల పేరుతో క్రూరమైన అగచాట్లు పెట్టటం ఎంతవరకు సమంజసం. అసలు తప్పు ఎక్కడ ఉందనే కారణం వెతికితే ఆ కారణం నిర్మూలనం చేయమంటారు తాతాజీ. ఇనుపకచ్చడాలు ఎలా ఉండేవో బొమ్మలు కూడా అందించారు. ఈ పుస్తకంలో

చివరగా ఒక్కమాట చదువుకోవటం నా హక్కు అని అన్నందుకు ఒక ఆడపిల్లని తుపాకీతో కాల్చారు. నీపై నాకు ప్రేమలేదు అన్నందుకు ఒక ఆడపిల్లను గొడ్డలితో నరికారు. వేరొకరిపై యాసిడ్ గుమ్మరించారు. స్నేహితునికి కలిసి వస్తున్న మరో నిర్భయను మానవ సభ్య సమాజం సిగ్గుతో తలదించుకొనేలా అత్యాచారానికి ఒడిగట్టారు. ఒక్కసారి ఆలోచించి చూస్తే ఈ కచ్చడాలు ఎవరికి ఎందుకు ఎలా ఉపయోగిస్తే సద్వినియోగం అవుతాయో మరి చెప్పనక్కరలేదు కదా!

(మే 8 తాపీ ధర్మారావు వర్ధంతి)

## మీరెవరో



### ఈ పుస్తకం చెపుతుంది

**-డి. రామచంద్రరాజు**

వెల : 150/- పేజీలు: 200

ప్రతులకు : 99083 24214

నీ అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చేస్తుంది ఈ పుస్తకం. మరింత సుఖంగా, అర్థవంతంగా జీవించడానికి ఉపకరించే సూక్తులూ, సంభాషణలూ, కథలూ, కథనాలూ, చరిత్రలూ ఈ పుస్తకమంతా నిండారి ఉన్నాయి. నువ్వు చదవడం ప్రారంభిస్తే చాలు, చివరిదాకా నిన్ను లాక్కుపోయే రచనా సంవిదానామూ శైలి శిల్పమూ నిన్ను ముగ్ధుడిని చేస్తుంది.

**-సింగమనేని నారాయణ**

## మన విజయవాడ



### బొమ్మ కలర్ కాదు బ్లాక్ అండ్ వైట్

**-జాన్సన్ చోరగుడి**

వెల : 60/- పేజీలు: 76

రచయిత అత్యంత ప్రతిభావంతంగా రాకెట్ వేగంతో నగర చారిత్రిక, సాంస్కృతిక, సామాజిక, ఆర్థిక, వాణిజ్య, రాజకీయ రంగాలలో వచ్చిన బహుముఖ పరిణామ క్రమాన్ని ప్రశంసనీయంగా చిత్రించారు. రెండు జీవనదులు - కృష్ణా, గోదావరి మధ్యగల వైవిధ్యాలను, వైరుధ్యాలను, రెండింటి మధ్య సమన్వయ సంస్కృతీ వైభవాలను వాడిగా, వేడిగా, వ్యంగ్యంతో రాశారు; తమ రచనను ఆకర్షణీయంగా చేయగలిగారు.

**-టి. వెంకటేశ్వరరావు**

## వికర్ణ



**- డా॥ చింతకింది శ్రీనివాసరావు**

వెల : 110/- పేజీలు: 160

ప్రతులకు : 88971 47067

వికర్ణ నవలా రచన ఒక కఠోర పరిశ్రమ. పరిశోధన! ఆ శ్రమని తాను ఆనందంగా స్వీకరించి, ఫలితాంశాన్ని చదువరులకు అందించారు. శ్రీనివాసరావు. అందుకు ఆయన అన్ని కైమోడ్పులకూ అర్హులు!

**- విహారి**

## జ్ఞాన చంద్రిక



### సామెతల సత్యవేదము

**- కవిచంద్ర మద్దా సత్యనారాయణ**

వెల : 50/- పేజీలు: 120

ప్రతులకు : 98492 57034

ఆయా గ్రంథాలలోని మార్గదర్శక వాక్యాల్ని పద్యాలుగా చెప్తూ వాటి తాత్పర్యాన్ని కూడా వివరిస్తూ, వీరు రాసిన విధానం, అందర్నీ ముఖ్యంగా బాలబాలికల్ని సరైన మార్గంలో పెట్టడానికి బాగా ఉపకరిస్తుంది.

**- అద్దేపల్లి రామమోహనరావు**

## సీమ కథా తొలకరి



### వ్యాస సంపుటి

**- డా॥ తవ్వా వెంకటయ్య**

వెల : 150/- పేజీలు: 146

ప్రతులకు : 97039 12727

ప్రస్తుతం పరిశోధనాత్మక గ్రంథంలో రాయలసీమ తొలికథ మీద సమగ్రమైన చర్చ చేశాడు వెంకటయ్య, అంతేగాకుండా రాయలసీమ కథకు ఊతమిచ్చిన వివిధ పత్రికలు వాటి సంపాదకులు, ప్రారంభించిన సంవత్సరం మొదలైన వివరాలు భావి పరిశోధకులకు ఎంతో ఉపయుక్తంగా ఉన్నాయి.

**- తప్పెట రాంప్రసాదరెడ్డి**

## హగ్ మి క్విక్



**- కె.యల్.వి.ప్రసాద్**

వెల : 150/- పేజీలు: 165

ప్రతులకు : 98662 52002

నా జీవిత కాలంలో కనీసం మూడు కథా సంపుటాలు తీసుకు రావాలన్నది నా కోరిక. ఈ కోరిక తీరుతుందా? అన్నది నన్ను చాలాకాలం వేధించిన ప్రశ్న. నా ఆలోచన, ధ్యేయం నెరవేరి మూడో కథల సంపుటి 'హగ్ మి క్విక్' తీసుకువచ్చే అవకాశం కలిగింది.

**- డా॥ కె.యల్.వి. ప్రసాద్**

# కళా కృషీవలుడు కానూరి వెంకటేశ్వరరావు



ప్రసిద్ధ కళాకారుడు, ప్రగతిశీల రచయిత కానూరి వెంకటేశ్వర్వరావు ఏప్రిల్ 10న తుదిశ్వాస విడిచారు. ప్రజా ఉద్యమాలతో మమేకమైన కానూరి తన కలాన్ని, గళాన్ని పేద ప్రజలకు అంకితం చేశారు. 1916లో కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా కోదూరులో ధనిక రైతు కుటుంబంలో కానూరి జన్మించారు. 1956లో వరంగల్ జిల్లా ములుగు తాలూకా ఘనపురంలో స్థిరపడ్డారు. తెలంగాణ సాయుధ పోరాట కాలంలో ప్రజానాట్యమండలిని స్థాపించిన వారిలో కానూరి ఒకరు. నక్సల్బరీ, శ్రీకాకుళం, గోదావరి రైతాంగ పోరాటాల ప్రేరణతో అరుణోదయ సాంస్కృతిక సమాఖ్యను స్థాపించారు. విరసం, ప్రజా రచయితల సమాఖ్యల ద్వారా రచయితగా, కళారూపాల దర్శకుడిగా. ప్రదర్శకుడిగా కళారంగంలో అవిరళ కృషి చేశారు. జార్జిరెడ్డి, శ్రీకాకుళం పోరాటం, పోట్ల రామనర్సయ్య, నీలం రామచంద్రయ్య హరికథలు, డాక్టర్ కోట్నిస్, గురజాడ, ఝాన్సీ లక్ష్మీభాయి, భగత్‌సింగ్‌ల బుర్రకథలు రాసి కళాకారులకు శిక్షణ ఇచ్చారు. బాయి భాగోతం, రాజధాని రగడ, ప్రగతి, ఇందిర జాలం, యక్షగానాలు, బొగ్గుకథలు, నృత్యరూపం, కాచనపల్లి అమరవీరుల రక్తదానం, నెల్లిమర్ల కార్మికుల పోరాట బుర్రకథలు రాశారు. బడిలో నాలుగో తరగతి మాత్రమే చదివి చదువు చాలించిన కానూరి కదిలించే రచనలు చేశారు. పాటల దండ్లను నడిపారు. తన అరువదేళ్ళ కళారంగ అనుభవాలతో ఆత్మకథాత్మకమైన రచన 'కథ కాని కథ . కానూరి 60 ఏండ్ల కళారంగ అనుభవాలు' వెలువరించారు. నాటి ప్రజానాట్యమండలి నుండి నేటి అరుణోదయ సాంస్కతిక సమాఖ్య దాకా ఎన్నో కళా ఉద్యమాల తీరుతెన్నులు ఆ పుస్తకంలో రాశారు. 1944లో ప్రజా నాట్యమండలి ద్వారా బుర్రకథ కళాకారునిగా రంగప్రవేశం చేశారు. వంతగాడిగా, వ్యాఖ్యాతగా తనదైన శైలిని ఆవిష్కరించారు. శ్రీకాకుళ పోరాటాన్ని కళ్ళకు కట్టే ఆయన 'జనగానం' ఎంతో ప్రసిద్ధి చెందింది. కె.వి. రమణారెడ్డి రాసిన గురజాడ జీవిత చరిత్ర 'మహోదయం' ను బుర్రకథ రూపంలోకి తెచ్చారు. వర్తమాన రాజకీయాలపై వ్యంగంగా రాసిన పాటలు ఎంతో ప్రాచుర్యం పొందాయి. సింగరేణి కార్మికుల వెతలకు అద్దం పడుతూ రాసిన 'బాయి భాగోతం' ఎన్నో ప్రదర్శనలు పొందింది. నాటి ప్రజానాట్యమండలి నుండి అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య, అరసం, విరసం, ప్రజా రచయితల సంఘం వంటి సంస్థలతో కలిసి పనిచేశారు. తెలంగాణ సాయుధ పోరాటంలో సాంస్కృతిక కార్యకర్తగా జీవితాన్ని ఆరంభించారు. మూడు తరాల కళాకారుల మధ్య వారధిగా నిలిచారు. వేలాది కవులకూ, కళాకారులకూ ఆయన మార్గదర్శి. తెలుగు నాట వ్యంగ్యాన్నీ, హాస్యాన్నీ పండించారు. బుర్రకథ, హరికథ, చిందు భాగవతం, పిట్టలదొర వంటి ఎన్నో కళారూపాలను ప్రజలను చైతన్య పరచడానికి ఉపయోగించారు.

## జ్ఞానపీఠం జయకాంతన్



సామాజిక, ఆర్థిక అసమానతలపై కలాన్ని ఎక్కుపెట్టిన అభ్యుదయవాది, ప్రముఖ తమిళ రచయిత, పద్మభూషణ్ జయకాంతన్ (81) ఏప్రిల్ 8న చెన్నైలో కన్నుమూశారు. తమిళ సాహిత్యరంగంలో నూతన ఒరవడిని సృష్టించారు. జయకాంతన్ 1934 ఏప్రిల్ 24న కడలూర్‌లోని మంజకుప్పంలో జన్మించారు. పాఠశాల విద్యను మధ్యలోనే ఆపివేసి చెన్నై చేరుకున్న ఆయన అవిభక్త కమ్యూనిస్ట్ పార్టీ ఆఫ్ ఇండియాలో చేరారు. కమ్యూనిస్ట్ పార్టీ నేతలు జీవానందం, బాలదండాయుథం ప్రోత్సాహంతో రచనలకు స్వీకారం చుట్టారు. కమ్యూనిస్ట్ మ్యాగజైన్లకు ఆయన చాలా సంవత్సరాలు రచనా సహకారాన్ని అందించారు. తమిళ సాహిత్యంలో 40కు పైగా నవలలు, 200 కథల్ని రాశారు. అత్యంత ప్రజాదరణ పొందిన ఆయన రచన సిల నేరంగలిళ్ సిల మనిదరగళ్‌కు 1972లో సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. దానిని కొన్ని సమయాల్లో కొందరు మనుషులు పేరుతో రచయిత మాలతీ చందూర్ తెలుగులోకి అనువాదం చేశారు. ఆయన రచించన పలు కథల్ని తెలుగులోకి మధురాంతకం రాజారాం అనువదించారు. ఆయన కథలు పంచవటి పేరుతో స్వాతి మాస పత్రికలో సీరియల్‌గా ప్రచురించగా ప్రముఖ కార్టూనిస్ట్, సినీ దర్శకుడు బాపు బొమ్మలు వేశారు. జయకాంతన్ రచనలపై ప్రముఖ రచయిత సుబ్రమణ్య భారతి ప్రభావం ఎక్కువగా ఉండేది. ఆయన రచనలు ఒరు నాదిగై నాదగమ్ పార్కిరళ్, యారుక్కగ అఝుధాన్ సినిమాలుగా తెరకెక్కాయి. ఉన్నై పోల్ ఒరువన్ చిత్రానికి సహనిర్మాతగా వ్యవహరించారు. ఈ చిత్రాన్ని రష్యాలో ప్రదర్శించారు. ఆయనకు రష్యా ప్రభుత్వం ఆర్డర్ ఆఫ్ ఫ్రెండ్‌షిప్ అవార్డును ప్రదానం చేసింది. ఆయన రచనల్ని ప్రముఖ దర్శకుడు బాలచందర్, ఇతర సినీ దర్శకులు తెరకెక్కించారు. ఆయనకు తెలుగు సాహితీరంగంతో కూడా అనుబంధం ఉంది. భారత ప్రభుత్వం పద్మభూషణ్ అవార్డుతో సత్కరించింది. సాహిత్య రంగానికి చేసిన సేవలకు గుర్తుగా 2002లో జ్ఞానపీఠ్ అవార్డుతోపాటు పలు అవార్డులు ఆయనకు దక్కాయి.

## అధ్యయన శీలి డా॥ యు.ఎ. నరసింహమూర్తి




*ఏప్రిల్ 16న విశాఖ బుక్‌ఫెస్టివల్‌లోని గురజాడ సాహిత్య వేదికపై ప్రసంగిస్తున్న డా॥ యు.ఎ. నరసింహమూర్తి.*

ప్రముఖ సాహిత్యవేత్త, విమర్శకులు డా॥ యు.ఎ. నరసింహమూర్తి ఏప్రిల్ 27న విజయనగరంలో తుదిశ్వాస విడిచారు. యు.ఎ. నరసింహమూర్తి సాహిత్య విమర్శకులుగా తెలుగు సాహిత్య క్షేత్రంలో సుపరిచితులు. నర్సింహమూర్తి స్వగ్రామం గజపతినగరం మండలం లింగాలవలస. ప్రాథమిక విద్యను గజపతినగరంలో అభ్యసించిన ఆయన ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఓఎస్ఎస్ఎల్‌సి భాషా, ప్రవీణ, ఎం.ఎ(తెలుగు), పి.హెచ్.డి. చేశారు. విజయనగరం మహారాజ కళాశాల తెలుగు శాఖ అధ్యక్షునిగా, అంతకు ముందు మున్సిపల్ పాఠశాల ఉపాధ్యాయునిగా విధులు నిర్వహించారు. విద్యార్థి దశనుంచే కవితలు, రచనలు, వ్యాసాలు రాయడం ప్రారంభించిన ఆయన తుదిశ్వాస విడిచే వరకూ అభ్యుదయ సాహిత్యానికి కృషి చేశారు. గురజాడ, శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణబాబు వంటి ప్రసిద్ధ రచయితల రచనలపై పలు విమర్శనా వ్యాసాలు రాసారు. 'కన్యాశుల్కం - 19 శతాబ్ది ఆధునిక భారతీయ నాటకాలు- తులనాత్మక పరిశోధన' పేరుతో 700 పేజీల రచన చేశారు. చర్వణ పేరుతో వారి సాహిత్య విమర్శనా వ్యాసాలను వెలువరించారు. అమెరికాలో ఉన్నప్పటి అనుభవాలతో 'వసంతం నుండి శిశిరం దాకా' అనే రచన ప్రచురించారు. శ్రీశ్రీ కవిత్వంపై రాసిన 'శబ్ద విరించి' తన చివరి రచన పలువురి ప్రశంసలు పొందింది. ఇటీవల విశాఖలో నిర్వహించిన విశాఖ బుక్‌ఫెస్టివల్‌లో గురజాడ సాహిత్య వేదికపై సాహితీస్రవంతి నిర్వహించిన 'తెలుగు భాష - వికాసం' కార్యక్రమానికి ముఖ్య అతిథిగా హాజరయి ప్రసంగించారు. ఆయన రాసిన 'చాసో కథాశిల్పి' గ్రంథానికి తెలుగు విశ్వవిద్యాలయం 2003 లో అవార్డును ప్రదానం చేసింది. తెలుగు వచనా శైలి పుస్తకం ద్వారా మాండలికాల ప్రాధాన్యతను, అవసరాన్ని వివరించారు. 'గిరాం' పేరిటి తెలుగు భాషా సాహిత్యవేత్త గిడుగు రామ్మూర్తి పంతులు రాసిన గ్రంథాలను ఆయన విశ్లేషించారు. 'ఔచిత్య ప్రస్థానం - సూరన కవిత్వం' అనే అంశంపై ఆచార్య ఎస్వీ రంగారావు పర్యవేక్షణలో పరిశక్షధన చేశారు. కేవలం వ్యాసాలు, పుస్తకాలు, కవితలు రాయడమే గాక, సాహిత్య విమర్శకునిగా, అధ్యయన శీలిగా పేరొందారు. సాహిత్యరంగంలో నిరంతర పరిశోధన, అధ్యయంన చేశారు. మారుతున్న సమాజంలో ప్రాచీన సాహిత్యానికి అత్యంత ప్రాధాన్యత ఇస్తూనే అధునిక సాహిత్కాయనికి జీవం పోశారు. ఈ నేపథ్యంలో దశాబ్దాల తరబడి తెలుగు రాష్ట్రాల్లో సాహితీ ప్రియుల ఆదరాభిమానాలు పొందారు. సాహితీ విమర్శకుడిగా విలువైన రచనలు చేసిన డా॥ యు.ఎ. నరసింహమూర్తి మృతి తెలుగు సాహితీలోకానికి తీవ్రమైన లోటు.

## సాహిత్య సేవకుడు

కవి, రచయిత, వక్త, పత్రికా సంపాదకులు, ప్రసారభారతి న్యూస్‌రిపోర్టర్ ఇలా పలు రకాలుగా 34 సంవత్సరాలుగా తెలుగు సాహిత్యానికి సేవలందిస్తున్నారు శశిశ్రీ. కడప జిల్లా సిద్ధవటంలో 1957, డిసెంబర్ 6న ఎస్.బి.సలీమాబీ, ఎస్.బి.రసూల్ దంపతులకు జన్మించారు. కడప పట్టణం కార్యక్షేత్రంగా సాహితీసేవ చేస్తూ వచ్చారు. మార్చి 31న రాత్రి సమయంలో తుదిశ్వాస విడిచారు. పుట్టపర్తి నారాయణాచార్యుల వారి దగ్గర ప్రాచీన సాహిత్యం, వై.సి.వి.రెడ్డి, డా.గజ్జెల మల్లారెడ్డి, ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి దగ్గర అభ్యుదయ సాహిత్యం శశిశ్రీ అధ్యయనం చేశారు. 1975-1980 లోనే "మనోరంజని" లిఖిత మాసపత్రికను, 1995 నుంచి "సాహిత్యనేత్రం" మాసపత్రికను స్థాపించి తెలుగు భాషా సేవలో తనదైన ప్రతిభను చాటుకున్న పత్రికా సంపాదకుడు శశిశ్రీ. పుట్టపర్తి నారాయణాచార్యులు తనకు తెలుగు సాహిత్యంలో ఓనమాలు నేర్పిన తొలి గురువని శశిశ్రీ సభాముఖంగా చెప్పుకునేవారు. 'ఒరే రహమతుల్లా! ఇప్పుడు కవిత్వం అని నాలుగు గీతలు గీసే వారంతా ఏదో ఒక కలం పేరు పెట్టుకుని చలామణి అవుతున్నారు. సరైన మార్గంలో రచనలు చేస్తున్న నీవు కూడా ఒక కలం పేరు పెట్టుకుంటే పోదా!' అని రహమతుల్లాతో పుట్టపర్తి అన్నారు. అయితే మీరే సూచించండి స్వామీ అని కోరగా... అప్పుడు పుట్టపర్తి 'శశిశ్రీ' అని పెట్టుకో పోరా అని నవ్వుతూ చెప్పాడు. ఆ విధంగా షేక్ బేపారి రహమతుల్లా 'శశిశ్రీ' కలం పేరుతో సాహిత్యసేవలను అందిస్తున్నారు. వీరు రచించిన కథలు ఆంగ్లం, హిందీ,



శశిశ్రీ

ఉర్దూ, కన్నడ, మలయాళ భాషలలో అనువాదమయ్యాయి. శశిశ్రీ ప్రతిభకు తార్కాణంగా ప్రతిష్టాత్మక పురస్కారమైన 'యునిసెఫ్ అవార్డు-2010' వంటి ఎన్నో పురస్కారాలు పొందారు. శశిశ్రీ విద్యారంగ సేవలకు గుర్తింపుగా రాష్ట్ర గవర్నరుచే 'యోగి వేమన విశ్వవిద్యాలయం పాలకమండలి సభ్యుడు' గా నియమితులయ్యారు. ఈనాడు శశిశ్రీ మన మధ్య లేకపోయినప్పటికీ వారి రచనలు సాహిత్య లోకంలో విరాజిల్లుతూన్నంతకాలం వారి కీర్తి కాయం జీవించివున్నట్లే.

- **సి. శివారెడ్డి**, సి.పి.బ్రౌన్ గ్రంథాలయం, కడప

# విశాఖ బుక్ ఫెస్టివల్‌లో ఆకట్టుకున్న గురజాడ సాహిత్య వేదిక

- వీరప్రసాద్




పుస్తకాలకీ రచయితలకీ అవినాభావ సంబంధం తెలిసిందే. రచయితలు అక్షర సృష్టి చేస్తేనే పుస్తకాలు వెలువడేది. అక్షరజ్ఞానం ఉన్న పాఠకులు పుస్తకాలను ఆదరిస్తే గొప్ప సంస్కార ప్రపంచం ఆవిష్కారమవుతుంది. విశాఖ బుక్ ఫెస్టివల్ అసోసియేషన్, ఆంధ్రా యూనివర్శిటీ, ఎన్‌బిటి, కేంద్ర సాహిత్య అకాడమీల సంయుక్త ఆధ్వర్యంలో విశాఖపట్నంలో ఏప్రిల్ 10 నుండి 19 వరకు 150 స్టాల్స్‌తో భారీ పుస్తక ప్రదర్శన జరిగింది. ప్రసిద్ధ చరిత్ర కారుడు, నేషనల్ బుక్‌ట్రస్ట్ పూర్వ అధ్యక్షులు బిపన్ చంద్ర పేరును పుస్తక ప్రదర్శన ప్రాంగణానికి పెట్టడంలో నిర్వాహకులకు రచయితల పట్ల ఉన్న గౌరవం వెల్లడవుతుంది. ఆ ప్రాంగణంలో ప్రతీరోజూ రచయితలకు పెద్దపీట వేస్తూ సాహిత్య కార్యక్రమాల నిర్వహణ కోసం 'గురజాడ సాహిత్య వేదిక' ను ఏర్పాటుచేయడం నిజంగా తెలుగు భాషా సాహిత్యాలను ప్రోత్సహించడమే. రెండు తెలుగు రాష్ట్రాల నుండి ప్రముఖ సాహిత్య వేత్తలు గురజాడ సాహిత్య వేదిక నుండి పలు సాహిత్యాంశాలపై ప్రసంగించడం అపురూపమైన దృశ్యం. ఏప్రిల్ 11 నుండి 18 వరకు రోజుకొక్క సాహిత్య అంశంపై ప్రముఖులు తమ అభిప్రాయాలను వెల్లడించారు. ప్రసంగాల అనంతరం ఉత్తరాంధ్ర జిల్లాల నుండి వచ్చిన కవులు చైతన్య స్వరాలు పేరిట తమ స్వీయ కవితలను వినిపించారు. విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలలోని కవులు, రచయితలు, సాహిత్యాభిమానులు ఈ గురజాడ సాహిత్య వేదిక కార్యక్రమాల్లో భాగస్వాములయ్యారు. సాహిత్య స్ఫూర్తి, సామాజిక స్ఫూర్తి రెండింటి మేలు కలయికగా గురజాడ సాహిత్య వేదిక కొనసాగింది. సాహిత్యం - సమాజం, ప్రపంచీకరణ-సంస్కృతి, సామాజిక అసమానతలు-సాహిత్యం, తెలుగు భాషా వికాసం, బహుభాషా కవిసమ్మేళనం, మీడియా-టివి-సినిమా, వర్తమాన సాహిత్యం- సవాళ్ళు, ఈనాటి సాహిత్యం ఎలా ఉండాలి? వంటి అంశాలపై ప్రసంగాలు సాగాయి.

వర్తమాన సమాజం ఎదుర్కొంటున్న కీలక అంశాలను ఈ వేదిక చర్చించింది. బాధ్యతాయుతమైన కర్తవ్యాల్లో ఉన్న సాహిత్యవేత్తల దగ్గర నుండి ఔత్సాహిక రచయితల వరకు ఈ వేదిక నుండి స్పందించారు. ఈ కారక్రమాల్లో పాల్గొన్న వారందరికీ గొప్ప స్ఫూర్తిని ఈ సదస్సులు అందించాయి. తొలిరోజు జరిగిన 'సమాజం-సాహిత్యం' సదస్సుకు ప్రముఖ సాహిత్యవేత్త రామతీర్థ అధ్యక్షత వహించారు. ఆంధ్రప్రదేశ్ శాసనమండలి ఛైర్మన్ ఎ. చక్రపాణి ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత కాత్యాయనీ విద్మహే, దామోదరం సంజీవయ్య లా యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ భగవత్ కుమార్, తెలకపల్లి రవి, విజయనగరం జిల్లా పరిషత్ ఛైర్మన్ శోభా స్వాతి రాణి, కె.ఆర్.డి. ప్రసాదరావు ప్రసంగించారు. ప్రసంగాల అనంతరం 'చైతన్య స్వరాలు' పేరుతో కవి సమ్మేళనం జరిగింది. తొలిరోజు చైతన్య స్వరాలు కార్యక్రమంలో బాల సుధాకర్ మౌళి, నూనెల శ్రీనివాసరావు, పి.ఎస్. శ్రీనివాస్, విజయభాను కోటే, చంద్రికారాణి, హరిచందన్, నాయని కళ్యాణదీప్తి తమ స్వీయ కవితలను వినిపించారు.

రెండవ రోజు ఏప్రిల్ 12న కేంద్ర సాహిత్య అకాడమీ కార్యక్రమం బహుభాషా కవి సమ్మేళనం జరిగింది. ఎల్.ఆర్. స్వామి అధ్యక్షత వహించిన ఈ సమావేశంలో తమిళనాడుకు చెందిన సాహిత్యవేత్త ఎం. తిరునవక్కరసు, గంటేడ గౌరునాయుడు, చింతకింది శ్రీనివాసరావు, పి.ఎస్. గోపికృష్ణన్, చిదానందసాలి, సిరికి స్వామినాయుడు, చింతా అప్పలనాయుడు, మోకా రత్నరాజు, జగద్ధాత్రి, పి. లక్ష్మణరావు పాల్గొన్నారు.

ఏప్రిల్ 13న 'ప్రపంచీకరణ - సంస్కృతి' అన్న అంశంపై సదస్సు జరిగింది. సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి చీకటి దివాకర్ అధ్యక్షత వహించిన ఈ కార్యక్రమంలో ప్రముఖ విద్యావేత్త చుక్కారామయ్య ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. అద్దేపల్లి రామమోహనరావు, తెలకపల్లి రవి, ఉప్పల అప్పలరాజు ప్రసంగించారు. ప్రధాన ఆదినారాయణ, కంచరాన భుజంగరావు , వెలుగు రామినాయుడ్ని, ఇనుపకుర్తి చిన సత్యనారాయణ తమ చైతన్య స్వరాలు వినిపించారు.

ఏప్రిల్ 14న 'సామాజిక అసమానతలు-సాహిత్యం' అన్న అంశంపై జరిగిన సదస్సుకు తెలంగాణ సాహితి కన్వీనర్ కె. ఆనందాచారి అధ్యక్షత వహించారు. ముఖ్య అతిథిగా శాసనమండలి సభ్యులు బొడ్డు నాగేశ్వరరావు పాల్గొన్నారు. జి.వి.రత్నాకర్, పి.ఎస్.

నాగరాజు ప్రసంగించారు. అనంతరం జరిగిన చైతన్య స్వరాల్లో ఎ.వి. కూర్మారావు, మానాపురం రాజాచంద్రశేఖర్, అనంతరావు, బులుసు సరోజిని, బాలు, సి. హెచ్.వి. లక్ష్మి, డి.వి.జి. శంకరరావు, ఎ.వి.ఆర్. మూర్తిలు స్వీయ కవితలు వినిపించారు.

ఏప్రిల్ 15న 'మీడియా–టివి–సినిమా' అన్న అంశంపై జరిగిన సదస్సుకు ప్రజాశక్తి సంపాదకులు ఎస్. వెంకట్రావ్ అధ్యక్షత వహించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్ ఛాన్స్‌లర్ జె.ఎస్.ఎన్. రాజు, శాసనమండలి సభ్యులు గేయానంద్ ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు. సాక్షి ఎడిటోరియల్ డైరెక్టర్ రామచంద్రమూర్తి, నవ తెలంగాణ దినపత్రిక సంపాదకులు ఎస్. వీరయ్య, 10టివి ఎం.డి. కె. వేణుగోపాల్, విశాఖ ఆకాశవాణి డైరెక్టర్ ఎ. మల్లేశ్వరరావు, స్వేచ్ఛ నిర్వాహకులు కిరణ్‌చంద్ర ప్రసంగించారు. రెడ్డి రామకృష్ణ, మల్లిపురం జగదీష్, చింతాడ రామారావు, మొయిద శ్రీనివాసరావు, భైరవభట్ల విజయాదిత్య, పరిమళ, భద్రి కూర్మారావు, ప్రణాళి తమ చైతన్య స్వరాలు వినిపించారు.

ఏప్రిల్ 16న 'తెలుగు భాష – వికాసం' అన్న అంశంపై జరిగిన సదస్సుకు ప్రజాశక్తి విశాఖ ఎడిషన్ ఇన్‌ఛార్జ్ సత్యాజీ అధ్యక్షత వహించారు. చెన్నైలో తెలుగు భాష ప్రాచీన హోదాకు న్యాయస్థానంలో పోరాడుతున్న తూమాటి సంజీవరావు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. యు.ఎ. నరసింహమూర్తి, వెలమల సిమ్మన్న, బి.ఏ.వి. రామారావు నాయుడు, జగద్ధాత్రి, దాట్ల దేవదానంరాజు ప్రసంగించారు. గుండాన జోగారావు, అమరజ్యోతి, శైలజామూర్తి, చెళ్ళపిళ్ళ శ్యామల, కె. అనురాధ, యు. శైలజ చైతన్యస్వరాలు వినిపించారు. ఏప్రిల్ 17న 'వర్తమాన సాహిత్యం– సవాళ్ళు' అన్న అంశంపై జరిగిన సదస్సుకు విశాఖ జిల్లా సాహితీస్రవంతి అధ్యక్షులు ఎ.వి. రమణారావు అధ్యక్షత వహించారు. ప్రముఖ కన్నడ అనువాదకులు పెంటకూరి గురుమూర్తి, శాఖమూరి రాంగోపాల్ ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు. చందు సుబ్బారావు, అట్టాడ అప్పల్నాయుడు, ప్రసాదమూర్తి, దుప్పల రవికుమార్ ప్రసంగించారు. జి. నాగేశ్వరరావు, కె.జి. వేణు, యం.వి.జి. భువనేశ్వరరావు, ఉప్పల అప్పలరాజు, చందనపల్లి గోపాలరావు చైతన్య స్వరాలు వినిపించారు. ఏప్రిల్ 18న 'ఈనాటి సాహిత్యం ఎలా ఉండాలి?' అన్న అంశంపై జరిగిన సదస్సుకు సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి అధ్యక్షత వహించారు. ప్రముఖ ఆర్థికవేత్త ప్రభాత్ పట్నాయక్ ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. అంపశయ్య నవీన్, గుడిపాటి ప్రసంగించారు.

సిపియం 21వ మహాసభ సందర్భంగా నిర్వహించిన నవల, కథ, కవితల పోటీ విజేతలకు ఈ వేదికపై బహుమతులను ప్రభాత్ పట్నాయక్ అందజేశారు. నవలల పోటీలో ప్రథమ బహుమతి ఖమ్మం జిల్లా పాల్వంచకు చెందిన శిరంసెట్టి కాంతారావు, ద్వితీయ బహుమతి కడప జిల్లా బాలరాజు పల్లెకు చెందిన సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి, తృతీయ బహుమతి కాకినాడకు చెందిన గనారా(జి. నాగేశ్వరరావు) అందుకున్నారు. కథల పోటీలో ప్రథమ బహుమతి హైదరాబాద్‌కు చెందిన సింహప్రసాద్, తృతీయ బహుమతి హైదరాబాద్‌కు చెందిన ఎమ్వీ రామిరెడ్డి అందుకున్నారు. ద్వితీయ బహుమతి అందుకోవాల్సిన పెద్దింటి అశోక్ కుమార్ సభకు హాజరుకాలేదు. కవితల పోటీలో ప్రథమ బహుమతి బెంగుళూరుకు చెందిన ప్రొ॥ కె. ఆశాజ్యోతి, ద్వితీయ బహుమతి ఖమ్మం జిల్లా ఇల్లెందుకు చెందిన కటుకోర్వ్యుల రమేష్, తృతీయ బహుమతి కాకినాడకు చెందిన ర్యాలిప్రసాద్ అందుకున్నారు.

ఈ మొత్తం కార్యక్రమాన్ని వొరప్రసాద్, చీకటి దివాకర్, ఎ.వి. రమణారావు, నూనెల శ్రీనివాసరావు సమన్వయం చేశారు. సాహితీస్రవంతి కార్యకర్తలు చంద్రికారాణి, నాగరాజు, కృష్ణవేణి, సృజనలు సహకారం అందించారు. ఈ గురజాడ సాహిత్య వేదికలో పాల్గొన్న అందరికీ మెమెంటోలను తుమ్మడి రాంగోపాల్ స్పోన్సర్ చేశారు. విశాఖలో ఇన్నిరోజుల పాటు సుమారు 160కి పైగా ప్రముఖుల దగ్గర్నుండి ఔత్సాహిక సాహితీవేత్తల వరకు పాల్గొన్న కార్యక్రమం విజయవంతంగా నిర్వహించడాన్ని పలువురు అభినందించారు. విశాఖలో ఒక పెద్ద సాహిత్య ఉత్సవం జరగడం ఇక్కడి వారిలో సాహిత్య స్ఫూర్తి నింపిందని అభిప్రాయపడ్డారు. విశాఖ బుక్‌ఫెస్టివల్, విశాఖ ఫెస్టివల్ నిర్వహించిన ఎం.వి.ఎస్. శర్మ, అజయ్ శర్మ, సుధాకర్, కె. లక్ష్మయ్య, విశాఖ బుక్ ఫెస్టివల్ అసోసియేషన్ అధ్యక్ష కార్యదర్శులు హిమాంశు ప్రసాద్, బి. శ్రీనివాస్ తదితరుల ప్రోత్సాహం వల్ల ఇంత పెద్ద కార్యక్రమం విజయవంతంగా ముగిసింది. అతిథులకు వై. సిద్దయ్య, అజయ్‌బాబు, ఎస్ఎఫ్ఐ కార్యకర్తలు చక్కని వసతి ఏర్పాటు చేశారు. విలువైన ప్రసంగాలు, చైతన్య స్వరాల కవితా గానం ఒక కొత్త ఉత్సాహాన్ని విశాఖలో నింపాయి.

సాహితీస్రవంతి ఆధ్వర్యంలో ప్రసిద్ధ సాహిత్యవేత్తల చిత్రాల ప్రదర్శన అందరినీ ఆకర్షించింది. 200కు పైగా తెలుగు, ఇతర




**సాహితీస్రవంతి ఆధ్వర్యంలో ప్రసిద్ధ రచయితల చిత్రాల ప్రదర్శన**

భాషల రచయితల ఫొటోలను ఈ స్టాల్‌లో ప్రదర్శించడం జరిగింది. పదిరోజుల పాటు ఈ స్టాల్‌ను సాహితీస్రవంతి కార్యకర్తలు కృష్ణవేణి, సృజన, చంద్రికారాణిలు ఎంతో శ్రద్ధగా నిర్వహించారు. గవిడి శ్రీనివాస్ కవితా సంపుటి 'వలసపాట', నేషనల్ బుక్ ట్రస్ట్ ప్రచురించిన 'లేత ఆకాశం' గొల్లపూడి మారుతీరావు రాసిన 'ఆత్రేయ' హుద్‌హుద్ తుఫానుపై రాసిన దీర్ఘకవిత సంపుటాలు ఈ వేదికపై ఆవిష్కరించడం జరిగింది. రచయిత్రి విజయభాను కోటె నేతృత్వంలో పాయకరావు పేట బాలబాలికలు ప్రదర్శించిన 'ఈ లోకం అందరిదీ' నృత్య రూపకం అలరించింది. గురజాడ సాహిత్య వేదిక సదస్సులకు చంద్రికారాణి, ప్రీతి, అనిల్‌లు ఆలపించిన ప్రారంభ గీతాలు వీనుల విందు కలిగించాయి.



విశాఖ జనకవనాన్ని ప్రారంభిస్తున్న ప్రముఖ కవి కె. శివారెడ్డి

# విశాఖ జనకవనం

- నూనెల శ్రీనివాసరావు
9492970231

సి.పి.యం 21వ జాతీయ మహాసభల సందర్భంగా ఏప్రిల్ 5న ఉదయం 10 గంటల నుండి సాయంత్రం 6 గంటల వరకు విశాఖపట్నం పౌర గ్రంథాలయంలో జనకవనం జరిగింది. అనూహ్యంగా తరలివచ్చిన అనేకమంది ఉత్తరాంధ్ర కవులు రచయితలతో ఆ ప్రాంగణమంతా పండుగ వాతావరణం నెలకొంది.

కార్యక్రమాన్ని ప్రారంభిస్తూ ప్రముఖ కవి కె.శివారెడ్డి విశాఖతో తన అనుబంధాన్ని గుర్తు చేసుకుంటూనే ''కళ్ళు మనకేనా...అవతలవాడికి వుండొద్దా.... అనే కవిత గానం చేశారు. రచనకు ఇప్పుడు వస్తువు సమస్యకాదని మన కళ్ళముందు బోలెడు వున్నాయని, జీవితంలోంచి సమాజంలోంచి కవిత్వం రావాలని, అది అందరిని అలరించినట్లు వ్రాసినప్పుడే అసలైన కవిత్వమౌతుందని అన్నారు.

అనంతరం ప్రముఖ సాహితీ విమర్శకులు, సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి మాట్లాడుతూ సామాజిక మాధ్యమాలపైన, పి.కె. లాంటి సినిమాలపైన, థియేటర్లపైనా దాడులు చేస్తూ భావ ప్రకటన స్వేచ్ఛకు భంగం కలిగిస్తున్న నేపథ్యంలో మనం ఉన్నామని, సెన్సార్ బోర్డుకే సెన్సార్ చేస్తున్న పాలకుల హయాంలో వున్నామని ఆందోళన వ్యక్తం చేశారు. రాష్ట్రంలో, కేంద్రంలో ప్రజాకంటక పాలనతో ఉద్యమాలు నిరసనలు అనివార్యమని కవులు రచయితలు తమ రచనలలో వాటిని ప్రతిబింబించాలని సూచించారు. ప్రస్తుత పరిణామాన్ని అర్థం చేసుకుంటూ కవులు రచయితలు మరింత పదునైన ప్రగతిశీలమైన రచనలు సృజించాలని అన్నారు. జనకవనం వంటి బృహత్ సమ్మేళనాలు అందుకు దోహదపడతాయని ఆకాంక్షించారు. సాహితీవేత్త రామతీర్థ అధ్యక్షతన మొదలైన 'జనకవనం' బాగా పేరున్న కవుల నుండి అప్పుడే వ్రాస్తున్న యువకవుల వరకు అందరూ తమ కవితలను ఉత్సాహంగా చదివి వినిపించారు. మధ్యమధ్యలో విశిష్ట అతిథులుగా పాల్గొన్న కె. ఆనందాచారి, సీతారాం, మువ్వా శ్రీనివాస్, గంటాడ గౌరునాయుడు, అట్టాడ అప్పలనాయుడు, నల్లి ధర్మారావు, లెనిన్ ధనిశెట్టి, చాగంటి తులసి తమ సౌహార్ధ సందేశాలను వినిపించారు.

సభలో పాల్గొన్న సి.పి.యం. పొలిట్ బ్యూరో సభ్యులు కామ్రేడ్ బి.వి. రాఘవులు ప్రసంగిస్తూ సాహిత్యం సమాజానికి అవసరం. సాహిత్యం లేకుంటే మానవత్వం చచ్చిపోతుంది. సాహిత్యం బలహీనపడితే మానవత్వం నిర్వీర్యం అయిపోతుంది. సమాజం సజీవంగా సంతోషంగా సమరశీలంగా సాగాలంటే సాహిత్య సృష్టి, సాహిత్య పఠనం నిరంతరాయంగా జరగాలి. అది అభివృద్ధి చెందాలని అన్నారు. చరిత్ర, సామాన్య శాస్త్రం, సాహిత్యం వద్దని కొందరు అంటున్నారు. అవి లేకుండా మానవ జీవితసారం ఏమీ అర్థం కాదని అన్నారు. తమిళం, కన్నడం వారిలాగా తెలుగువారికి మాతృభాషపై ప్రేమా, శద్ధా లేకపోవడం విచారకరమని తెలుగు రాష్ట్రాల్లో తెలుగుభాషను ప్రోత్సహించే బాధ్యత కవులు రచయితలపై ఉందని అన్నారు. భావ ప్రకటన స్వేచ్ఛకి భంగం కలిగితే కవులు కలాలను కత్తుల్లా ఎక్కుపెట్టాలని పిలుపునిచ్చారు. సాహిత్యకారులకు తమ పార్టీ ఎల్లప్పుడూ మద్దతుగా నిలుస్తుందని చెప్పారు.

జనకవనాన్ని సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్, చీకటి దివాకర్, సత్యాజీ, జంధ్యాల రఘుబాబు, చంద్రికారాణి అత్యంత ఆసక్తికరంగా నిర్వహించారు. తెలకపల్లి రవి ఆద్యంతం సమీక్షిస్తూ సమన్వయం చేశారు. దాదాపు 110 మంది కవులు కవితాగానం చేశారు. అందులో 25 మంది మహిళలు మరో 5 గురు విద్యార్థులు వున్నారు. సమయానుభావం వలన మరో పదిమంది కవులు తమ కవితలను చదివే అవకాశం లేక వెనుతిరిగారు. ఈ సభ ప్రారంభించే ముందు విజయవాడకు చెందిన డాక్టర్ శమంతకమణి ప్రయోగాత్మకంగా రూపొందించిన కథల సీ.డీ "ఆకాశమంత..."ను ప్రజానాట్యమండలి సీనియర్ కళాకారులు గంగిరెడ్డి సన్యాసిరావు ఆవిష్కరించారు. ఈ కార్యక్రమంలో ప్రముఖ కవి, పాటల రచయిత దేవేంద్ర, అరుణ్‌జీలు పాల్గొన్నారు.

జన కవనానికి 250 మందికి పైగా వచ్చిన కవులు, రచయితలు, సాహిత్య అభిమానులతో సభా ప్రాంగణమంతా కిక్కిరిసిపోయింది. ఖాళీ లేక కొంతమంది వెనుతిరిగిపోవడం కనిపించింది. వచ్చిన వారందరికీ భోజనం ఏర్పాటు చేయడం జరిగింది. విశాఖ చరిత్రలో ఇంతమంది కవులు కవితాగానం చేయడం ఇదే మొదటిసారని చెప్పుకోవడం వినిపించింది.

మొత్తానికి సి.పి.యం. వారు నిర్వహించిన జనకవనం అత్యంత విజయవంతంగా ముగిసింది. ఈ కార్యక్రమ నిర్వాహణలో సాహితీ స్రవంతి నుండి వొరప్రసాద్, చీకటి దివాకర్, ఎ.వి. రమణారావు, నూనెల శ్రీనివాసరావు, సత్యాజీ, చంద్రికారాణి, మరియు ఎస్. నాగరాజు, సి.పి.యం. వారికి సహకారమందించారు.

## కాకినాడ జనకవనం



మానవతా విలువలను కాపాడుకోవడం కోసం కవులు గళం విప్పాలని ప్రముఖ కవి, విమర్శకులు డాక్టర్ అద్దేపల్లి రామ్మోహనరావు అన్నారు. తూర్పుగోదావరి జిల్లా కాకినాడ వెంకటరత్నపురంలో గల గాంధీభవన్‌లో సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో మార్చిన 29న ఉభయగోదావరి జిల్లాల అపూర్వ కవి సమ్మేళనం "జనకవనం" జరిగింది. ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించిన డాక్టర్ల అద్దేపల్లి తన ప్రసంగంలో రాబోయే కాలంలో మరింతగా కవులు తమ గొంతెత్తి విలువలను కాపాడుకోవడంతోపాటు సామాన్య ప్రజల కష్టాలపై మరింతగా స్పందించాల్సిన అవసరముందన్నారు. సిపిఎం అఖిల భారత మహాసభలు విశాఖపట్నంలో నిర్వహిస్తున్న సమయంలో సాహితీ స్రవంతి సంస్థ సుమారు వందమందికిపైగా కవులతో జనకవనం నిర్వహించడం అభినందనీయమన్నారు. ముఖ్య అతిథిగా పాల్గొన్న ప్రముఖ రచయిత్రి, ఐడియల్ కళాశాలల కరస్పాండెంట్ డాక్టర్ పి. చిరంజీవినీకుమారి మాట్లాడుతూ ప్రపంచీకరణ నేపథ్యంలో ప్రజల అవసరాలను మార్కెట్ చేసుకునే విపరీత ధోరణులు పెరిగాయని అన్నారు. కవులు, కళాకారులు, మేధావులు అందించే భావజాలం సమాజంలో ఎంతో మార్పు తీసుకొస్తుందని చెప్పారు. ఒక్కరి సుఖమే కోరుకునే ప్రపంచీకరణ సంస్కృతికి వ్యతిరేకంగా సర్వే జనా సుఖినోభవంతు అనే సంస్కృతి కోసం కవులు ప్రజలను చైతన్యవంతం చేసే దిశగా తమ గొంతులు వినిపించాలని, కవితలు రాయాలని సూచించారు. అనంతరం సాహితీ స్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి వొరప్రసాద్ మాట్లాడుతూ సాహిత్యం విలువ ఈనాడు ఎంతైనా ఉందని ప్రజల్లో మమేకమయ్యే కళలను వారివద్దకు తీసుకెళ్ళే ప్రయత్నంలో భాగంగా కవులు స్పందించాలన్నారు. సిపిఎం ఆధ్వర్యాన నిర్వహిస్తున్న కవి సమ్మేళనాలు లోతైన విశ్లేషణలకు వేదికగా నిలుస్తున్నాయన్నారు. కవులు తమ కవితల ద్వారా సమాజాన్ని జాగృతం చేయడానికీ, మానవతా విలువల్ని పెంపొందించేందుకూ "జనకవనం" దోహదం చేస్తోందని అన్నారు. సభా ప్రారంభకులుగా పాల్గొన్న జి. సుబ్బారావు మాట్లాడుతూ సాహితీ స్రవంతి ప్రతినెలా కవితాగోష్ఠులు నిర్వహించడం అభినందనీయమనీ, అందులో పాలుపంచుకుంటున్నందుకు గర్వంగా ఉందనీ అన్నారు. సాహితీ స్రవంతి కన్వీనర్ గదుల నాగేశ్వరరావు (గనారా) మాట్లాడుతూ రెండో వార్షికోత్సవానికి తమ సంస్థ సిద్ధపడుతుందని తెలిపారు. కవుల ఆలోచనలు, ఆశయాలను ప్రతిబింబించే విధంగా సాహితీస్రవంతి తన నెలవారీ కార్యక్రమాలను నిర్వహిస్తుందన్నారు. టివిఎస్ ప్రకాష్ మాట్లాడుతూ సమాజ గమనానికి శ్రమే కీలకమైందని, 99 శాతం మంది ప్రజల గోడును వినమని చెప్పేదే సామాజిక కోణమని అన్నారు. సాహిత్యరంగాన్ని తగిన దిశలో తీసుకెళ్లాల్సిన కర్తవ్యం కవులదేనని అన్నారు. కరపకు చెందిన ఎనిమిదో తరగతి విద్యార్థినులు కడియాల సత్య, వాసంశెట్టి అనూష వినిపించిన కవితలు కవుల మన్ననలు పొందాయి. ఈ కార్యక్రమంలో కవులు అద్దేపల్లి ప్రభు, గడల శివప్రసాద్, దాట్ల దేవదానంరాజు, కత్తిమండ, డాక్టర్ పుయ్యాపు హనుమంతరావు, పాత్రికేయులు శ్రీనివాస్ ప్రసంగించారు. ఈ కార్యక్రమానికి పెద్దఎత్తున సాహితీ అభిమానులు హాజరయ్యారు.

### కవితా సంపుటాలకు ఆహ్వానం

పాతూరి మాణిక్యమ్మ స్మారక సాహిత్య అవార్డు కొరకు 2014 సం॥లో ప్రచురింపబడిన తెలుగు వచన కవితా సంపుటాలను ఒక ప్రకటనలో ఆహ్వానించారు. ఉత్తమ కవితాసంపుటికి రూ. 5,000/- నగదు బహుమతి పురస్కారం ఇవ్వబడుతుంది. మే31లోగా 3 పుస్తకాలను పాతూరి అన్నపూర్ణ, 1156/28-1, ప్రశాంతినగర్, నవలాకుల గార్డెన్స్, నెల్లూరు - 2 అనే చిరునామాకు పంపవలసిందిగా కోరారు. వివరాలకు 9490230939, 9949237534 ద్వారా సంప్రదించవచ్చును.

### 'అవయవ దానం' పై కవితల పోటీ

డా॥ ద్వా.నా.శాస్త్రి 68వ పుట్టినరోజు సందర్భంగా "కిన్నెర-ద్వా.నా. పురస్కారం" ప్రకటించారు. "అవయవదానం" అనే అంశంపై 25 పంక్తులకు మించని వచన కవితను మే 15 లోపు పంపవలసిందిగా కోరారు. బహుమతులు 3 వేలు, 2 వేలు, 1 వెయ్యి రూపాయలు. కవితలు పంపవలసిన చిరునామా : మద్దాళి రఘురామ్, కిన్నెర ఆర్ట్ థియేటర్స్, ఫ్లాట్ నం. 101, 2-26674/153, సెంట్రల్‌ఎక్సైజ్‌కాలనీ, హైదరాబాద్ - 13, E-mail : info@kinnera.net

## కర్నూలు జన కవనం



పాలకుల ఏకపక్ష ధోరణిని కవులు ప్రశ్నించాలని సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి అన్నారు. మార్చి 29న కర్నూలులో లక్ష్మీనర్శింహ కళ్యాణ మండపంలో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో 'జనకవనం' జరిగింది. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా హాజరయిన ఆయన మాట్లాడుతూ తెలుగు భాష, సంస్కృతి పరిరక్షణకు పాలక పక్షాలు శ్రద్ధ చూపడం లేదన్నారు. రెండు తెలుగు రాష్ట్రాల సిఎంలు మన సంస్కృతిని పక్కన పెట్టేందుకు సిద్ధమయ్యారన్నారు. నవ్యాంధ్ర రాజధానికి అమరావతి పేరు పెట్టి దాని నిర్మాణానికి సింగపూర్‌ను ఆశ్రయించడమేమిటని ప్రశ్నించారు. యాదగిరి గుట్టను యాదాద్రిగా పేరు మార్చేందుకు తెలంగాణ ప్రభుత్వం నిర్ణయించడం సరికాదన్నారు. ప్రాచీన భాష హోదా కింద కేంద్ర ప్రభుత్వం ప్రతి ఏడాది కేటాయించే రూ.100 కోట్లు నిధులు మూల్గుతున్నాయన్నారు. వాటిని ఖర్చు చేయడంలో ప్రభుత్వాలకు చిత్తశుద్ధి లేదన్నారు. గ్రంథాలయాలు, తెలుగు భాషాభివృద్ధికి బడ్జెట్‌లో ప్రాధాన్యత కల్పించలేదన్నారు. ఇటీవల విజయవాడలో నిర్వహించిన ప్రపంచ తెలుగుభాష మహాసభలో శ్రీశ్రీ, గురజాడ లాంటి కవులను స్మరించకపోవడం విచారకరమన్నారు. ప్రగతిశీల సాహిత్యాన్ని పెంపొందించేందుకు సాహితీస్రవంతి కృషి చేస్తుందన్నారు. ఉస్మానియా కళాశాల తెలుగు అధ్యాపకులు అన్వర్ హుస్సేన్ మాట్లాడుతూ జిల్లాలో తెలుగు భాష మరింత విస్తృతంగా విస్తరించేందుకు కృషి చేస్తున్నామన్నారు. ప్రముఖ రచయిత ఎస్.డి.వి. అజీజ్ మాట్లాడుతూ జనకవనం పేరుతో కవులను ప్రోత్సహించడం అభినందనీయం అన్నారు. వియోగి ప్రసాద్ మాట్లాడుతూ ప్రజలను హత్తుకునే కవిత్వం రాయాలన్నారు. సాహితీస్రవంతి జిల్లా అధ్యక్షులు జంధ్యాల రఘుబాబు అధ్యక్షత వహించిన సభలో జిల్లా కార్యదర్శి కెంగార మోహన్, ప్రజాశక్తి ఎడిషన్ ఇన్‌ఛార్జ్ పి. చంద్రయ్య ప్రసంగించారు. అనంతరం నాలుగు జిల్లాల నుండి వచ్చిన కవులు కవితలను చదివి వినిపించారు.

## దుట్టా శమంతకమణి కథా సంపుటి 'ఆకాశమంత' ఆవిష్కరణ

చిన్న చిన్న అంశాలతో కథలు రాసి పెద్ద సందేశాలను అందించేందుకు డాక్టర్ దుట్టా శమంతకమణి చేసిన కృషి అభినందనీయమని సామాజిక మాధ్యమ విశ్లేషకులు, ప్రజాశక్తి పూర్వ సంపాదకులు వి.శ్రీనివాసరావు అన్నారు. కథంటే కాలక్షేపాన్నిచ్చేందుకు కాదు, మానసిక ఉల్లాసాన్నిచ్చేదని, సమాజాన్ని మార్చేదని తెలిపే విధంగా శమంతకమణి రచించిన కథలున్నాయని ఆయన పేర్కొన్నారు. డాక్టర్ దుట్టా శమంతకమణి కథల సంపుటి "ఆకాశమంత" పుస్తకావిష్కరణ ఏప్రిల్ 25న గాంధీనగర్లోని హనుమంతరాయ గ్రంథాలయంలో జరిగింది. ముఖ్యఅతిథిగా హాజరైన శ్రీనివాసరావు పుస్తకాన్ని ఆవిష్కరించారు. దీంతోపాటు అదే పేరుతో రూపొందించిన సిడిని ఆవిష్కరించారు. తొలి ప్రతిని, తొలి సిడిని దుట్టా శమంతకమణి తల్లి సుశీలకు అందజేశారు. వక్తలను గుండు నారాయణరావు వేదికమీదకు ఆహ్వానించగా, ప్రజాశక్తి బుకహౌస్ సంపాదకులు కె. ఉషారాణి సభకు అధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా శ్రీనివాసరావు మాట్లాడుతూ, ప్రతి కథలోనూ సమస్య, హృదయ స్పందన, హృదయరాగం అన్నీ కలగలసి ఉన్నాయని తెలిపారు. "నేర్చుకోవాలి తల్లి" అనే మాట ఇందులో అభ్యుదయ కోణంలో ప్రస్ఫుటంగా కనిపిస్తోందని పేర్కొన్నారు. నేటి సమాజంలో కథ పాత్ర విభిన్నమైందని గుర్తు చేశారు. తెలియకుండానే సమాజాన్ని ప్రభావితం చేస్తాయంటూ గతంలో ఆ పాత్ర పోషించిన అనేక నీతికథలను ఆయన ఉదహరించారు. జీవితంలో అంతర్భాగంగా



**విజయవాడ, గాంధీనగర్‌లో హనుమంతరాయ గ్రంథాలయంలో ఏప్రిల్ 25న దుట్టా శమంతకమణి కథల సంపుటి, ఆడియో క్యాసెట్ 'ఆకాశమంత' ను ఆవిష్కరిస్తున్న వి. శ్రీనివాసరావు. చిత్రంలో దుట్టా శమంతకమణి, కె.ఎన్.వి. ప్రసాద్‌బాబు, కె. ఉషారాణి, వడ్లమూడి పద్మ, దుట్టా సుశీల.**

పెనవేసుకుపోయిన కథలను కొద్దిమంది ఛాందసవాదులు మహిళలను కించపరిచేందుకు ఉపయోగించుకున్నారని అన్నారు. ఉషారాణి మాట్లాడుతూ, ఆకాశమంత పుస్తకంలో రచయిత్రి అనేక సమస్యలను చర్చించారని అన్నారు. ఆంధ్రజ్యోతి పాత్రికేయురాలు వడ్లమూడి పద్మ పుస్తక పరిచయం చేస్తూ సమాజంలో ఎదురవుతున్న అనేక సవాళ్లను స్త్రీలు ఆత్మస్థైర్యంతో ఎలా ఎదుర్కొన్నారో ఇందులో స్పష్టం చేశారని వివరించారు. ఈ కార్యక్రమంలో కెఎన్.వి.ప్రసాద్‌బాబు, డాక్టర్ బి.ఉదయభాస్కర్, సురేష్ నిఖిలం పాల్గొన్నారు. వారికి శమంతకమణి జ్ఞాపికలిచ్చి సత్కరించారు. సాహితీ స్రవంతి జిల్లా అధ్యక్షులు కె.సత్యరంజన్ వందన సమర్పణ చేశారు.



జి.వి.ఆర్ ఆరాధన కల్చరల్ ఫౌండేషన్ ఆధ్వర్యంలో ఏప్రిల్ 2న త్యాగరాయ గాన సభలో "మా వూరు" కవితా సంకలనం ఆవిష్కరణలో పాల్గొన్న మావూరు సంపాదకులు గుదిబండి వెంకటరెడ్డి, నేటినిజం సంపాదకులు బైస దేవదాసు, డా॥ చెన్నయ్య, సి.రామకృష్ణ, ఆవిష్కర్త డా॥సినారె, సమాచార హక్కు చట్టం కమీషనర్ పి. విజయబాబు, పద్మశ్రీ డా॥ అనగాని మంజుల, పొత్తూరి సుబ్బారావు, గజవెల్లి తదితరులు.



విశాఖ బుక్‌ఫెస్టివల్‌లో ఏప్రిల్ 11న 'కన్యాశుల్కం చిత్రాల ప్రదర్శన' స్టాల్‌ను ప్రారంభిస్తున్న నేషనల్ బుక్‌ట్రస్ట్ రీజనల్ డైరెక్టర్ డా॥ ప్రత్తిపాక మోహన్. చిత్రంలో తెలకపల్లి రవి, రామతీర్థ, చిత్రకారులు సూర్యారావు, పి.ఎస్. శ్రీనివాసరావు, చీకటి దివాకర్, కె. లక్ష్మయ్య తదితరులు ఉన్నారు.

## 'బలివాడ కాంతారావు స్మారక కథల పోటీ

భారత నిధి ఫౌండేషన్ చారిటబుల్ ట్రస్ట్ సౌజన్యంతో విశాఖ రచయితల సంఘం, విశాఖ సంస్కృతి మాసపత్రిక సంయుక్తంగా "బలివాడ కాంతారావు స్మారక కథల పోటీ" నిర్వహిస్తోందని ఒక ప్రకటనలో తెలిపారు. దీంతో పాటు ఒక విశిష్ట రచయితకు "బలివాడ స్మారక పురస్కారం" అందచేయాలని సంకల్పించారు. ఎంపిక చేసిన మూడు కథలకు ప్రథమ బహుమతి రూ.7,500/-, ద్వితీయ బహుమతి రూ.5,000/-, తృతీయ బహుతి రూ.2,500/- చొప్పున అందచేస్తారు. రచనలను కార్యదర్శి, అడపా రామకృష్ణ, ఇంటి నెం. 43-21-21, వరుణ్ షోరూమ్ ఎదురుగా, వెంకట్రాజు నగర్, దొండపర్తి జంక్షన్, విశాఖపట్నం - 530016, ఫోన్ - 9505269091. కథలు చేరడానికి తుది గడువు 31-05-2015. విశాఖపట్నంలో జూలై మూడో తేదీన నిర్వహించే బలివాడ కాంతారావు జయంతి సభలో బహుమతి ప్రదానం జరుగుతుంది.

## శిలపరశెట్టి కవితా పురస్కారం - 2014

శిలపరశెట్టి రాములు నాయుడు స్మారక కవితా పురస్కారం కోసం 2014 జనవరి - డిసెంబరు మధ్య కాలంలో ప్రచురింపబడిన స్వీయ కవితా సంపుటాలు 3 కాపీలు మే, 31 లోగా మాధవీ సనారా. 14-18-1, కామాక్షి కోవెల వీధి, నిదానం దొడ్డి, అనకాపల్లి - 531002, చిరునామాకి పంపవలసిందిగా ఒక ప్రకటనలో కోరారు. ఉత్తమ కవితా సంపుటికి రూ.3116/- నగదు ప్రశంసాపత్రం మెమెంటోతో కవిని సత్కరించనున్నట్లు తెలిపారు. ఇతర వివరాలకు సెల్ 9440103134కి సంప్రదించగలరు.

## కార్డు కథా రచయితలకు విజ్ఞప్తి

మేము గతంలో మినీ కథా సౌరభం, హాస్యకథ-2010, హాస్యకథ-2011 అనే మూడు హాస్య కథా సంకలనాలను వెలువరించాము. ఇప్పుడు హాస్యకథ-2012 అచ్చవుతోంది. ఇందులో 'కార్డు కథలు' కూడా కలుపుదామని సంకల్పించాం. 2012 సంవత్సరంలో పత్రికల్లో అచ్చయిన కార్డు కథలను ఈ సంకలనం కోసం మే 15వ తేదీలోగా ఈ క్రింద ఇవ్వబడిన చిరునామాకు పంపగోరుతున్నాం. కార్డు కథపై ఏ నెల, ఏ సంవత్సరం, ఏ పత్రికలో అచ్చయిందో వివరం రాయగలరు. ఒక రచయిత కథ ఒకటి మాత్రమే ఈ సంకలనంలో అచ్చేస్తాము. కార్డు కథలను (మీ ఫొటో, చిరునామా, సెల్ నెంబరుతో) పంపగలరు. మీ కథలు ఈమెయిల్ ద్వారా కూడా పంపవచ్చు. హాస్యకథ -2012 అచ్చయిన తర్వాత ఒక కాపీని మీకు పంపిస్తాము. చిరునామా: ఏ.వి. మోహనగుప్తా, 23-26-1/ఏ, సుమాణం వారి వీధి, సత్యనారాయణపురం, విజయవాడ -520 011. 9849442868. E-mail : avmcartoons@gmail.com

-ఏవిఎమ్, వియోగి

## మైగిఫ్ట్ సాహితీ పురస్కారాలు

సాహిత్యంలో చేస్తున్న అవిరళ కృషికిగాను గుర్తింపుగా 'మైగిఫ్ట్ యువ సంస్థ" ఆధ్వర్యంలో ప్రతి ఏటా ఒకరిని ఎంపిక చేసి అవార్డ్‌తోపాటు ప్రశంసాపత్రం, శాలువా, రూ.3116/- నగదు అందజేయడం జరుగుతుందని పెరుకరాజు ఒక ప్రకటనలో తెలిపారు. మైగిఫ్ట్ సాహితీ పురస్కారాలు 2011 నుండి 2014 వరకు పత్రికా సంపాదకులు బైస దేవదాస్, నేటినిజం ఈ దిగువ తెలిపిన వారిని ఎంపిక చేయడం జరిగిందని తెలిపారు. 2012 - డా॥ పత్తిపాక మోహన్, కవి నేషనల్ బుక్‌ట్రస్ట్ సహాయ సంపాదకులు (కరీంనగర్), 2013 - డా॥ ఆడుబాల సుజాత, కవి శాతవాహన కళాశాల ఉపన్యాసకురాలు (కరీంనగర్), 2014 - తోకల రాజేశం కవి, టీచర్, (అదిలాబాద్) వీరికి సంస్థ నిర్వహించే ప్రత్యేక కార్యక్రమంలో అవార్డ్‌లను ప్రధానం చేయడం జరుగుతుందని పెరుకరాజు, మైగిఫ్ట్ సారథి (ఉద్యోగం -దేశరక్షణశాఖ, ఆర్మీ విభాగం) తెలిపారు.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,




విశాఖ బుక్ ఫెస్టివల్‌లో
గురజాడ సాహిత్య వేదికపై
ఏప్రిల్ 11 నుండి 18 వరకు జరిగిన
సాహిత్య కార్యక్రమాల దృశ్యాలు

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A159 |
| పుస్తకం పేరు | చేస్తానం |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | Yas |
| వెనుక అట్ట | Yas |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | K Daveen |
| పేజీలు విడదీసినది | K Daveen |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | GOOD |